గంగిశెట్టి లక్ష్మీనారాయణ

# ధర్మపథం

(ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ధారావాహికంగా
వెలువడుతున్న 'ధర్మపథం'లోని కొన్ని అనర్ఘ రత్నాలు)

మొదటి భాగం

రచన :

బులుసు వేంకటరమణయ్య

ప్రచురణ



రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

DHARMA PATHAM

Selections from 'DHARMA PATHAM'

By Sri Bulusu Venkata Ramanayya



యువభారతి

ప్రచురణ : 45

ప్రథమ ముద్రణ : ప్రతులు 3,200

31 మార్చి, 1976

ముఖచిత్ర రచన :

శీలా వీర్రాజు

ముద్రణ :

జ్యోతి ప్రెస్, ముషీరాబాదు, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ ;

న్యూ విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు.

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

USED FOR THE PRINTING OF THESE BOOKS

DE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA

AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమాణాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి గడచిన పన్నెండేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటే ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 44 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల యాభై వేలకుపైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 3,700 మందికి పైగా సాహితీమిత్రులు చేరారు. రానున్న ఉగాది నాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఐదువందల మందికి పైగా భారతీ మిత్రులుగా, యాభై మంది భారతీభూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలోనైనా సభ్యులుగా చేరి మా "నందిని" మాసపత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. "నందిని"లో యువభారతి కార్యకలాపాల వివరాలేకాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయన శీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.

మార్చి 31, 1976

# మా మాట



చెప్పేవాళ్ళు లేక చెడిపోయాడని ఒక సామెత. ధర్మాన్ని పాటిస్తూ సంఘ శ్రేయస్సుకోసం మనుగడ సాగించాలనుకున్న వాళ్ళకు ధర్మమంటే ఏమిటో స్పష్టంగా తెలియాలి. దేశ కుల పాత్రములనుబట్టి ధర్మంలో స్థూలంగా వైవిధ్యం కనిపించవచ్చు. కాని సూక్ష్మంగా ఋషి ప్రోక్తమైన ధర్మం ఒక్కటే. సమాజం "మనకేం చేస్తున్నది?" అనే వాళ్ళకు ధర్మంతో పనేలేదు, ఒకవేళ పనిబడినా వాళ్ళకు లాభంకలిగించేదే ధర్మం అని వ్యాఖ్యానించి సమర్థించుకొని కుక్షింభరులై, పరాన్న భుక్కులై సంఘపీడనమే కర్తవ్యంగా మనుగడ సాగిస్తూ ఉంటారు. "సమాజం కోసం మనం ఏం చేస్తున్నాం?" అనే జిజ్ఞాస ఉన్నవాళ్ళకే ధర్మాధర్మ విచక్షణతో పని ఉంటుంది. వేదాలు, పురాణాలు, మహాకావ్యాలు ఎన్నో ధర్మ సూక్ష్మాలను సోపపత్తికంగా తెలుపుతూనే ఉన్నవి. మన దేశంలో ధర్మం దైనందిన జీవితంలో పెనవేసుకునిపోయి ఉన్నది. మన ధర్మాల స్వరూప స్వభావాలు దైనందిన జీవితవృత్తానికి ప్రామాణికమైన వ్యాఖ్యానాలు, మార్గదర్శక సూత్రాలు సరళమైన భాషలో ధర్మాలను, ఆదర్శాలను వివరించాలనే కుతూహలాన్ని నన్నయ నాటినుండి నేటికీ విజ్ఞులు మన దేశంలో ప్రదర్శిస్తూనే ఉన్నారు.

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు పాండురంగ మహాత్మ్యం వ్యాఖ్యాతలుగా, అనేక గ్రంథ ప్రణేతలుగా, సాహిత్యశాస్త్ర రహస్య వేదులుగా విద్వల్లోకానికి చిరపరిచితులు. బ్రహ్మాండాది నానాపురాణాలను, రామాయణాది ఇతిహాసాలను ఇంకా మరెన్నో సంప్రదాయాలను తలస్పర్శిగా అవగాహన చేసికొన్న మనీషివతంసులు. "ఆంధ్ర సచిత్ర వారపత్రిక"లో వారిటీవల "ధర్మపథం" అనే శీర్షిక క్రింద ప్రచురించిన అనేకానేక వ్యాసాలను సేకరించి కొన్నింటిని పుస్తక రూపంలో ప్రచురించగలుగుతున్నాం. ధర్మజిజ్ఞాస సామాజికులకు పరమావశ్యకమనే మా విశ్వాసమే ఈ పుస్తకాన్ని ప్రచురింపజేస్తున్నది. ఈ ప్రచురణకు అవకాశాన్ని కల్పించిన శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు తమ సౌహార్దానికి, భాషాబాంధవ్యానికి సాహిత్యాభిమానానికి యువభారతి భక్తి పురస్సరమైన కృతజ్ఞాభివందనములను సమర్పించుకొంటున్నది.

ఈ సందర్భంగా ఆంధ్ర సచిత్ర వారపత్రికాధినేతలు శ్రీ శివలెంక రాధాకృష్ణగారు యువభారతిపట్ల చూపిన సౌజన్యం మరువరానిది. వారికి మా నమస్సులు.

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు

# నా మాట

ఎనిమిదేళ్ల క్రిందటి మాట!

ఆంధ్రపత్రికాధిపతులూ, తత్సంపాదకులూ అయిన శ్రీ శివలెంక రాధాకృష్ణ గారు జాతిమత వివక్షలేకుండా అందరికీ నచ్చేరీతిని ఆర్షవిజ్ఞానాన్ని తమ పత్రిక మూలంగా ప్రచారం చేయవలెనని సంకల్పించారు. నన్ను పిలిపించి, ఆ విషయమై చిన్నచిన్న వ్యాసాలు వ్రాస్తే ప్రతీవారం తమ సచిత్రవారపత్రికలో ప్రకటించ గలమని తెలియజేశారు. నేను పరమ సంతోషంతో నా సంసిద్ధతనూ తెలియజేశాను. వెంటనే "ధర్మపథం" అనే శీర్షిక ఆంధ్రవారపత్రికలో ప్రారంభమయింది. కొద్ది కాలంలోనే అది ప్రజామోదాన్ని పొందినట్లు పత్రికకు వచ్చిన ఉత్తరాలవల్ల స్పష్ట మయింది. అప్పటినుంచీ అవిచ్ఛిన్నంగా వారపత్రికలో "ధర్మపథం" వస్తూనే ఉన్నది.

పిన్నలనూ పెద్దలనూ, స్త్రీలనూ పురుషులనూ, విజ్ఞులనూ విద్యార్థులనూ మనస్సులో పెట్టుకొనే అప్పుడప్పుడు తోచిన విషయాలను - నేననుకున్నది సరియైనది అవునా, కాదా అని వివిధగ్రంథాల సహాయంతో నిశ్చయించుకొని, వాటికి అక్షర రూపం ఇవ్వడం జరుగుతున్నది.

కొన్ని శీర్షికలు ప్రకటించబడిన తర్వాత - వీటిని పుస్తకరూపంలో ప్రకటిస్తే బాగుండునని కొందరు మిత్రులు సలహా ఇచ్చారు. ఒకరిద్దరు గ్రంథప్రకాశకులు వీటిని పుస్తకరూపంలో ప్రకటిస్తామన్నారు. కాలం కలిసిరానందున ఇప్పటివరకూ ఆ పని జరగలేదు. స్వయంగా ప్రకటించడానికి శక్తిలేక ఉపేక్షించవలసి వచ్చింది.

"ధర్మపథం" లోని కొన్ని శీర్షికలను పుస్తకరూపంగా ప్రకటించదలచామనీ, అనుమతి ఇవ్వవలసిందనీ ''యువభారతి'' నుండి జాబు వస్తుందని నేను అనుకోలేదు. అనుకోకుండానే ''యువభారతి'' అధ్యక్షులు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారి వద్ద నుంచి డిసెంబరు మొదటివారంలో జాబు వచ్చింది. ఆనందంతోపాటు ఆశ్చర్యం కలిగి

వెంటనే నా సమ్మతిని కృతజ్ఞతతో తెలియజేశాను. అనుకోనంత శీఘ్రకాలంలోనే పుస్తకం వెలువడడం కూడా జరిగిపోయింది.

పన్నెండేళ్ల బాల్యావస్థలో ఉన్న "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ ఏ ప్రౌఢసంస్థలకూ సాధ్యంకాలేని సాహిత్యసేవను ఎడతెగకుండా సాగిస్తున్నది. ఏదో ఒక పక్షానికీ, ఒక ప్రాంతానికీ చెందక, ప్రాచ్యనవ్యభేదం లేకుండా యావదాంధ్రుల సంస్కృతికీ, సాహితికీ అంకితమైన యీ సంస్థ చేస్తున్న కృషిని మెచ్చనివారుండరనుకుంటాను. ఆ సంస్థ పక్షంలో ప్రకటితమైన యీ పుస్తకం బహుళప్రచారాన్ని పొందగలదని నా విశ్వాసం.

''ధర్మపథం" వ్యాసాలను తమ ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రకటిస్తూ, ఈ పుస్తకం వెలువడుటకు కారకులైన శ్రీ శివలెంక రాధాకృష్ణ గారికి కృతజ్ఞతలను అర్పించుకుంటున్నాను. దీని ప్రకటన బాధ్యతను వహించిన యువభారతి సంస్థ అధ్యక్షులు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారికీ, సంస్థకార్యనిర్వాహక వర్గంవారికీ నా కృతజ్ఞతలు.

ఇది ఆంధ్రుల ఆదరాభిమానాలను పొందగలిగితే, మరికొన్ని వ్యాసాలనుకూడా గ్రంథరూపంగా వెలువరించుటకు ప్రయత్నించగలనని మనవి చేస్తున్నాను.

84 - పురుషోత్తమ నగరు
క్రోంపేట, మద్రాసు-44
తేది 15-1-1976

—బులుసు వేంకటరమణయ్య

# ఘంటాపథం

ఉపన్యాసం కంటె ఉపదేశం చేయటం కష్టం. ఉపన్యాసంలో విషయవికాస విస్తరణాలకు ప్రాముఖ్యం ఉంటుంది; ఉపదేశంలో సంగ్రహసూత్ర రచనకు ప్రాధాన్యం ఉంటుంది. మొదటిది సాహిత్యసంబంధి; రెండవది శాస్త్రసంబంధి. వేదాలలో, శాస్త్రాలలో సూత్రరచనవంటి సంగ్రహవాక్యాలకే స్థానం. అపార గంభీర తాత్పర్యాన్ని పరిమితపదజాలంలో వ్యక్తీకరించటం ఉపదేశరహస్యం. వైయాకరణులు అందువల్లనే సూత్రంలో ఒక అక్షరంతగ్గితే పుత్రోదయమైనట్లు పొంగిపోతారట. మంత్రవేత్తలుకూడా అంతే. ఉపదేశంస్థూలంగా రెండు విధాలు. ఒకటి ఆధ్యాత్మికం; రెండు లౌకికం. ఆధ్యాత్మికోపదేశం మంత్ర మార్గంలో నడిస్తే, లౌకికోపదేశం సూత్ర మార్గంలో నడుస్తుంది. సూత్రం ఛందోబద్ధమైనప్పుడు సూక్తిగా సాక్షాత్కరిస్తుంది. ఆదికవి నన్నయ 'నానారుచిరార్థసూక్తినిధి'నని తననుగూర్చి విశేషంగా చెప్పుకున్నాడు. సూక్తికి రుచిరార్థత్వం ప్రధానలక్షణమని ఆయన చేసిన నిష్కర్ష. కాంతిమంతము, స్వాదువు అయిన అర్థం సూక్తిసులక్షణసారం. వేదసూక్తులు ఋక్కులు; కావ్య సూక్తులు రుచిరార్థోక్తులు!

సూక్తుల లక్ష్యం ధర్మోపదేశం. ధర్మం చతుర్విధపురుషార్థాలకు మూలం; అర్థకామమోక్షాలలో అంతస్సూత్రంగా వర్తించే ఆంతర్యం. ధర్మవిరహితమైన పురుషార్థం జగత్కంటకమైన పరుషార్థం. పురుషార్థ ప్రవృత్తిలేని మానవజీవితం నిరర్థకం. అంటే, సార్థకమైన మానవజీవితం పయనించేమార్గమే ధర్మపథం. ధర్మపథంలో ధర్మార్థకామమోక్షాల ప్రగతి జీవిత పరమార్థం, సంస్కృతి అంటే ఈ పరమార్థ సమాచరణమే. ధర్మపథసమీక్షణం సంస్కారం; ధర్మసమాచరణం సంస్కృతి. సంస్కృతి విశిష్టమైన జీవితపద్ధతి నాగరకత. సంస్కృతిలో జాతియొక్క ప్రవృత్తిని వృత్తి ధర్మాపేక్షఉంది. నాగరకతలో ప్రవృత్తిధర్మశీలం ప్రకృష్టంగా భాసిస్తుంది. నాగరకత వైభవం సంస్కృతిశక్తిమీద ఆధారపడిఉంది. సంస్కృతిభిత్తిక, నాగర కత చిత్రం నానావర్ణరంజితమైన చిత్రం భిత్తికను సమాశ్లేషించి సముజ్జ్వలంగా

ప్రకాశిస్తుంది. భిత్తికకు వర్ణభేదంలేదు. అలాగే సమాజవ్యవస్థనాశ్రయించియున్న నాగరకతకు స్థిర సమాశ్రయత్వాన్ని కల్పించటమే సంస్కృతిలక్షణం. సంస్కృతిలోని శక్తి ధర్మం. అంటే సమాజశ్రేయస్సుకు మూలశక్తి ధర్మం. ఆ ధర్మం ఉక్తినాశ్రయించి ప్రపంచింపబడినప్పుడు సూక్తి అవుతుంది. అందువల్లనే ప్రతినాగరకజాతి సాహిత్యంలోనూ సూక్తికి సమున్నత గౌరవముంది. సూక్తులలో వ్యక్తమయ్యే ధర్మపథం జాతిమనోరథానికి ఘంటాపథం!

రుచిరార్థసూక్తులు మౌక్తికాలవంటివి. ఒక్కొక్క మౌక్తికం ఒక మహనీయ సత్యం. జీవితమార్గంలో ఒక్కొక్కమణి ఒక్కొక్క వెలుగు కిరణాన్ని ప్రసరిస్తుంది. జీవితమార్గం ఎంతవిశాలమైందో అంత దీర్ఘమైందికూడా! బ్రతుకుబాటనంతా వెలుగులతో నింపుకోవాలంటే మణిదీపాలనెన్నో వెలిగించుకోవాలి. వాటిని సేకరించటం, మెరుగు పెట్టటం, సముచితస్థానంలో అలంకరించటం, వాటికాంతి కలకాలం నిలిచేలా రక్షించటం - ఇవన్నీ మానవులు తీసికోవలసిన జాగ్రత్తలు. అందరికీ ఆ దీపాలను అలంకరించుకోవటం చేతకాదు; కొందరికి ఆ దీపాలవిలువలు, వాటి ఉపయోగవిధానం తెలియక పోవచ్చు. అప్పుడు వాటి విలువల్నీ, ఉపయోగ విధానాన్నీ, సాధకబాధకాలనీ, అలంకరణశిల్పాన్నీ, చెప్పే నిపుణులు లోకానికి కావాలి. ఆ నిపుణుల్నే వ్యాఖ్యాతలనవచ్చు; సూక్తికథకులనవచ్చు. సూక్తులను చెప్పేవారిలో సూత్రప్రవక్తల అంశ ఉంటుంది, సూక్తివ్యాఖ్యాతలలో వృత్తికారుల హితప్రవృత్తి ఉంటుంది. వ్యాఖ్యాతలు సూక్తిలోని శక్తిని సామాజిక జీవితానికన్వయించి సముజ్జ్వలం చేస్తారు. ఆసక్తిని పెంచటానికి ప్రసన్న కథాకలితార్థయుక్తులతో సమన్వయాన్ని సరసవినోదబంధురం చేస్తారు. సూక్తిరచనలు సార్వకాలిక సత్యనిధులు. సూక్తివ్యాఖ్యానాలు సరసార్థబోధ సుధాస్రవంతులు. సమకాలీన సమాజానికి కావలిసిన సూక్తి మౌక్తికాలను ఎన్ని వాటిని వ్యాఖ్యాసూత్రంతో ముత్యాలసరంగా గ్రుచ్చి, అందమైనహారంగా ఆస్వాదయోగ్యంగా సూక్తికథకుడు సామాజికులకందిస్తాడు. ప్రతితరంలోనూ ఈకృషి కొనసాగవలసిందే. జీవస్రవంతిలాసాగే జాతిజీవితంలో సూక్తి కథాస్రవంతి అంతశ్శ్రోతస్వినిగా అనంతరుచులను ప్రసాదిస్తూ ఉంటుంది. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి 'ధర్మపథం' ఆదారిన నడిచిన ఆదర్శ సాహిత్యం!

మనమిప్పుడు జీవిస్తున్నది హేతువాదయుగంలో. హేతువు బుద్ధినాశ్రయించిన గుణం. తర్కం దాని ప్రవృత్తిరూపం. హేతువాదం బహిరింద్రియ ప్రమాణానికిచ్చిన ప్రాముఖ్యం మనఃప్రమాణానికి ఇవ్వదు. అందువల్ల భౌతిక సత్యాన్నే ప్రమాణంగా

నమ్మి మానసిక సత్యానికి గౌణమైన స్థానమిస్తుంది. అయితే, బుద్ధి గమ్యమైన అంశా లన్నీ భౌతికంగా ప్రత్యక్షం కాకపోవచ్చు. బుద్ధి గమ్యమైనవి తార్కిక సత్యాలన వచ్చు. తర్కవితర్కాలలో సత్యం మరుగుపడిపోయే అవకాశం ఉంది. అప్పుడు మిగిలేది వాదం మాత్రమే. ఆ వాదం సత్యాశ్రయం కావటానికి తోడ్పడేది హృదయం. అంటే ధర్మనిర్ణయం చేసే బుద్ధికి అనుభవసూత్రాన్ని అందించే అంతశ్శక్తి హృదయం. హృదయానికి ఆ శక్తి సంస్కృతివల్ల వస్తుంది, ఆ సంస్కృతి ధర్మపథానుశీలనంలో ఉంది. జాతి హృదయప్రసారానికీ, బుద్ధివికాసానికీ తోడ్పడేది ధర్మపథం. హేతు వాద యుగంలో కూడా హృదయపథంలో నిలిచేది ధర్మపథం !

'ధర్మపథం' - ఎంత అర్థవంతమైన పేరు. దీన్ని కర్మధారయంగా కాకుండా రూపకంగా అన్వయించుకుంటే ఎంతో గంభీరంగా ఉంటుంది. ధర్మం ఒక మార్గం. ఒక మార్గం కాదు; ఏకైక మార్గం. బాట ప్రజోపయోగార్థం వేయబడుతుంది. బాటకూ నియమం ఉంటుంది. బాటసారులకూ నియమం ఉంటుంది. బాటకిరు ప్రక్కలా ఇళ్ళుంటాయి, చెట్లుంటాయి. ఇళ్ళల్లో వ్యష్టిధర్మాన్ని పాటించినా బాటలో మనిషి సమిష్టి ధర్మాన్ని పాటించాలి. బాటలో నడకకే ఒక నియమం ఉంది. చతుష్పథంలో పాటించవలసిన జాగ్రత్తలున్నాయి. ప్రతివ్యక్తికీ బజారులో స్వాతంత్ర్యం ఉంటుంది; అయితే, అది ఇతరుల స్వాతంత్ర్యానికి అడ్డురాకుండా మలచుకోవలసి ఉంటుంది. అందరూ కలిసి సుశిక్షితంగా నడవ టానికి నియమపాలనం నిత్యవిధిగా పాటింపవలసి ఉంది. ధర్మపథంలో చెప్పే సూక్తులుకూడా అటువంటివే. బ్రతుకుబాట పయనంలోని పరమార్థాన్ని చెప్పే గతి సూత్రాలవి. బాట నియమాలను వివరించే సదుపాయాలు ప్రభుత్వం చేస్తున్నట్లుగానే ధర్మపథవిషయాలను వివరించే బాధ్యత పత్రికలూ, పండితులూ స్వీకరిస్తారు. నేటి సమాజంలో ప్రజాప్రవృత్తిని తీర్చిదిద్దేవి ప్రధానంగా పత్రికలు. ఆ తరువాత ప్రజా సంస్థలు. ఆంధ్ర సచిత్రవారపత్రిక శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి 'ధర్మపథ' శీర్షికద్వారా తన కర్తవ్యాన్ని నిర్వహించింది. అందుకు వారిరువురూ అభినంద నీయులు ! ఆ తరువాత 'ధర్మపథ' ప్రచురణతో ప్రజాసంస్థచేయవలసిన ధర్మాన్ని 'యువభారతి' నిర్వహిస్తున్నది. ఇది ఎంతో సమంజసం. సమాజ పురోగమనానికి "ట్రావలర్స్ గైడ్" ఈ ధర్మపథం !

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు "ధర్మపథం"లో సూక్తి కథా ప్రవచన శిల్పానికి చక్కని బాటలు వేశారు. తాము చెప్పదలచుకున్న ధర్మసూక్తి తాత్పర్యానికి రక్తికట్టించే వాతావరణాన్నీ, వ్యాఖ్యానాన్నీ కల్పించి, చక్కని కథాకథన శైలిలో

సారసుందరంగా చెప్పే శక్తి వారి సహజోక్తికి అలంకారం. ముద్దులొలికే ముచ్చటైన వాక్యవిన్యాసం, ఆసక్తిని పెంచే ప్రపంచన విధానం, విశ్లేషించి చెప్పే వివేక సామర్థ్యం, దృష్టాంత గ్రథనంలో కనిపించే సమన్వయం, శైలిలో వినిపించే ఆప్యాయత, ప్రతిపాదనలో ప్రసరించే ప్రసన్నత వేంకటరమణయ్యగారి "ధర్మపథ" రచనాన్ని ప్రజామోదం పొందేటట్లు చేశాయి. తెలుగువారికి వారందించే ధర్మపథం కలకాలం అక్షర జగత్తులో నిలిచిపోయే ఘంటాపథం !

హైదరాబాదు
31-3-1976

జి. వి. సుబ్రహ్మణ్యం

గంగిశెట్టి లక్ష్మీనారాయణ

# ధర్మపథం

## జీవన్ముక్తులు

ఏ ప్రాణి అయినా ఒక జన్మలో చేసుకొన్న పుణ్యపాపాలను అనుసరించిన ఫలాన్ని తరువాతి జన్మలో అనుభవించవలసి వుంటుంది. ఆ జన్మలో చేసిన పుణ్య పాపాల ఫలం మరో జన్మలో అనుభవించాలి. వాటితో సంబంధం ఉన్నంత కాలం బంధం ఉన్నట్లే. పుణ్యంగాని, పాపంగాని మిగులులేకుండా పూర్తిగా అనుభవించిన వెంటనే ముక్తి కలుగుతుంది. అంటే-బంధంనుంచి విడుదల ఏర్పడుతుంది. ఆ విడుదలను పొందడమే ముక్తి, దాన్ని పొందేవారు ముక్తులు.

ఈ విధంగా ముక్తి అనేది జీవికి దేహత్యాగానంతరమే కలుగుతుంది.

అయినా, కొందరు జీవించి ఉండగానే మోక్షం పొందినవారి స్థాయిని అందుకొంటారు. అట్టివారే జీవన్ముక్తులని అనిపించుకొంటారు.

బ్రతికి ఉండగానే ముక్తులు కావడం సాధ్యమవుతుందా?

సాధ్యమవుతుంది. ప్రయత్నిస్తే సాధ్యంకానిది సాధారణంగా ఉండదు.

దానికి సాధన ఎంతో అవసరం !

ఆ సాధన వల్ల ఈ దృశ్యమాన జగత్తంతా బ్రహ్మ స్వరూపమే అని, పరమ పురుషుడైన బ్రహ్మపదార్థంకంటె ఇతరమైనది మరి ఏదీ లేదని విశిష్టజ్ఞానం ఏర్పడుతుంది.

ఈ విషయాన్నే, 'సర్వం ఖల్విదం బ్రహ్మ; పురుషాన్నపరం కించిత్' అనే శ్రుతి వాక్యాలు వివరిస్తూ ఉన్నవి.

అట్టి జ్ఞానం పొందినవానికి అంతా సమానంగానే కానవస్తుంది. కాని దేని విషయంలోనూ భేదభావం ఉండదు.

'ఇది జీవుడూ' 'ఇది పరమాత్మ'-అనే తారతమ్యం కూడా అతనికి కానరాదు,

'మమ జీవిత్వ మీశత్వం
కల్పితం, వస్తుతో నహి,
ఇతియస్తు విజానీయాత్
సజీవన్ముక్త ఉచ్యతే'

అనే నిర్ణయం దీనిమూలంగానే ఏర్పడింది.

'నేను జీవుడననీ-బంధంనుంచి విముక్తుడనయితే పరమాత్మలో లీనమవుతాననీ-అనడం కేవలం కల్పితమైనదే; యదార్థంగా అటువంటి భేదంకానరాదు'—అని ఎవ్వడైతే తెలుసుకుంటాడో అతడే 'జీవన్ముక్తుడు' అని దీని అభిప్రాయం.

ప్రకృతితో సంబంధం ఉంటేనే బంధం ఉన్నట్లు గ్రహించాలి.

భేదభావం లేకుండా సమస్తమూ సమానంగా ఉండేవానికి బంధమనేది వుండదు.

బంధమనేది లేనప్పుడు దానినుండి విడుదల-మోక్షం అనేది వుండడానికి అవకాశం లేదు.

ఈ విధంగా బంధమూ-దాని ననుసరించిన ముక్తీ-ఈ రెండూ సంభవించని వాడు జీవన్ముక్తుడు.

జీవన్ముక్తుడు-కష్టసుఖాలతోనూ-మంచి చెడ్డలతోనూ-ఇత్యాదులైన ద్వంద్వాలతో సంబంధం పెట్టుకొనడు.

## దేవదానవులు

మన పురాణాలల్లో తరచుగా దేవతలూ, దానవులూ వస్తూవుంటారు. ఈ రెండు తెగలవారికీ విరోధం అజన్మసిద్ధం. దేవతలు మంచివారనీ దానవులు చెడ్డవారనీ ప్రతీతి. అంతేకాకుండా దేవతలు అందంగా వుంటారనీ, రాక్షసులు వికారంగా వుంటారనీ భావన. పదితలల రావణుడూ మూడుతలల త్రిశిరుడూ రాక్షసులలో ఉన్నారు.

ఆలోచించి చూస్తే దేవదానవులు సవతితల్లి బిడ్డలు. కశ్యపుని భార్య అదితి కొడుకులు దేవతలు; దితికొడుకులు దైత్యులు. అదితి కొడుకులు, సురులు దితి కొడుకులు అసురులు. దేవతలు అమృత ప్రభావంవల్ల అమరులైతే మృతసంజీవని

వల్ల రాక్షసులున్నూ యుద్ధాలలో చచ్చినా బ్రతికేవారు. సవతి తల్లి బిడ్డలకు విరోధం ఉండటంలో వింతలేదు. కాని స్వరూపంలో భేదం ఎందుకువస్తుంది?

వికారరూపం దేవ, మానవ, రాక్షసులలో ఎవరికయినా ఉండవచ్చును. అట్టి వికారరూపాలనుబట్టే అవయవాలను కల్పించటం పరిపాటి. మానవుల అవయవ నిర్మాణంకంటె రాక్షసులది విభిన్నంగా ఉండాలనే అభిప్రాయంతోనే రావణుడికి పది తలలువచ్చాయి. పదిమంది కలిసి అరిస్తే ఎంత ధ్వని అవుతుందో, రావణుని అరుపువల్ల అంత ధ్వని వస్తుంది. అతనిది మిక్కిలి పెద్ద గొంతుక. అందువల్లనే దశకంఠుడు అయాడు. పదికంఠాలనుబట్టి (వాస్తవానికి పదికంఠాలు లేకపోయినా) పది తలలు వాటిని బట్టి యిరవై చేతులూ కల్పించబడ్డాయి. ఇరవై కాళ్లను చెప్పకపోవడం విచిత్రమే.

ఇలాంటి కల్పన మానవుల విషయంలోనూ ఉన్నది. కార్తవీర్యార్జునుడికి సహస్రబాహువు లున్నాయట! నిజంగా లేనేలేవు. వెయ్యి చేతులతో చెయ్యగలిగిన పనిని ఆయన తన రెండు చేతులతోనే చెయ్యగలుగుతాడు. యదార్థం సంగతిని విడిచిపెట్టి వెయ్యి చేతులు కల్పించబడినవి!

హనుమంతుడు లంకలో సీతాదేవిని వెతుకుతున్నప్పుడు రావణుని అంతఃపురములో ఎందరో అందకత్తెలు కానవస్తారు. మందోదరిని చూసి సీత ఏమో అనే అనుమానం కూడా కలిగింది.

శ్రీకృష్ణుని మనమడు అనిరుద్ధుడు బాణాసురుని పుత్రిక ఉషను వివాహం చేసుకొంటాడు. వీటిని బట్టి చూస్తే దానవ స్త్రీలలో ఎందరో అందకత్తెలున్నారని తెలుస్తున్నది.

దానవులలోనూ విభీషణుడు, ప్రహ్లాదుడు మొదలైనవారున్నారు. దేవతల్లోనూ దుఃస్వభావము కలవారున్నారు. క్రూర కృత్యాలు చేసే మానవులను రాక్షసులని నిందిస్తున్నారు ప్రజలు!

దేవదానవులకు స్వరూపాన్నిబట్టి భేదం ఏర్పడలేదు; స్వభావన్నిబట్టే ఏర్పడింది. సత్వ, రజ. స్తమో గుణాలు మూడు కదా! వీటిలో సాత్త్విక ప్రకృతి కలవారు దేవతలలో ఎక్కువ. రాజస తామస ప్రకృతులు కలవాళ్లు దానవులలో ఎక్కువ.

ఈ సంఖ్యా బలాన్నిబట్టే దేవతల మంచితనం, దానవుల క్రౌర్యం ప్రచారం పొందింది. అవి గ్రంథస్థాలు కావడంవల్ల ఆ ప్రచారం కలకాలం నిలిచిపోయింది.

## రక్షణ

ఏదేనా కష్టం వచ్చినపుడు దాన్ని తప్పించుకోడానికి తగిన ఆసరా కావాలి. ఆ రీతిగా రక్షణ యిచ్చేవారు ఆప్తులు. వారు మానవులకు సాధ్యమయినంతగా చూస్తారుగాని, మానవాతీతమైన విషయాల్లో ఏమీ చెయ్యలేరు. అపుడు భగవంతుడే రక్షించాలి.

మానవాసాధ్యాలయిన రోగాలుగాని, ఆపదలుగాని వచ్చినప్పుడు దేవుణ్ణి ప్రార్థించడం మొక్కుబళ్లు చెల్లిస్తామని మనస్సులోనే నిర్ణయించుకోవడం మనదేశంలో పరిపాటి అయింది.

భగవంతుని దృష్టిలో అందరూ సమానులే! కాని రక్షణ కోరే వారందరికీ అది లభిస్తున్నదా? భగవంతునికి మొక్కుకొన్నా, ప్రార్థించినా కొందరికి సాఫల్యం కలగ కుండా ఉన్నది. దానికి కారణం ఏమిటి? ఈ ప్రశ్న సాధారణంగా కలుగుతుంది.

పశువులు గ్రామాన్నుంచి మందలు మందలుగా మేతకు పరిసరప్రాంతాలకు వెళ్లుతూవుంటాయి. పచ్చికబయళ్లలో మేస్తూ సమీపంలో ఉండే అడవులకు కూడా అవి వెళ్లుతూ వుంటాయి. పశుపాలకుడు చేతిలో ఒక కర్ర పట్టుకొని అవి సక్రమంగా నడిచేటట్లూ,చెదిరిపోయినవి మళ్లీ మందలోకి చేరేటట్లూ అదుపులో ఉంచుతాడు. శత్రు మృగాలనుంచి వచ్చే అపాయాలను వారిస్తాడు. నిజంగా వాటికి అతడే రక్షకుడు అని చెప్పవలసి ఉన్నది. ఆ విధంగానే భగవంతుడున్నూ ప్రజలను రక్షించవలసి ఉన్నది. కొందరికి రక్షణ ఎందుకు లభించలేదు?

'ఇదిగో! నేను నిన్ను రక్షిస్తాను; భయపడకు' అని దేవుడు ప్రత్యక్షంగా వచ్చి అభయం ఇవ్వడం పురాణాల మాటకాని, ఇప్పుడు జరిగేదికాదు.

ఏ దేవతలను కొలిచినా సరే; ఎవ్వరూ ప్రత్యక్షంగా కాపాడరు.

అయితే-దేవతలను ప్రార్థిస్తే ప్రయోజనంలేకపోలేదు.

వారు స్వయంగా రారుకాని, ఆ ఆపదను గడిచే ఉపాయాన్ని తోపించే బుద్ధిని ప్రసాదిస్తారు. ఆ బుద్ధిని ఉపయోగించుకొని స్వప్రయత్నంవల్ల ఆపదను తప్పించు కోవడం మానవుని కర్తవ్యం. అంతేకాని, ప్రయత్నంచేయకుండా "దేవుడా! నీదే భారం" అని కూర్చోడంకూడదు. ఈ విషయాన్నే యీ శ్లోకం తెలియజేస్తున్నది-

'నదేవా యష్టి మాదాయ
రక్షంతి పశుపాలవత్,
యం హి రక్షితు మిచ్ఛంతి
బుద్ధ్యా సంయోజయంతితమ్'

పశుపాలకుడు కర్ర పట్టుకొని పశువులను రక్షించినట్లుగా దేవతలు బాధ్యత లేకుండా ప్రవర్తించే మానవులను రక్షించరు. వారు రక్షించదలచుకొన్నవారికి ఆత్మరక్షణోపాయాన్ని తెలియచేసే బుద్ధిని ఇస్తారు-అని దీని అభిప్రాయం.

గాలిలో దీపాన్ని పెట్టి-'దేవుడా! ఇది ఆరి పోకుండా చూచే భారం నీది' అని అనుకోవడం అవివేకం!

## మొక్కదగినవారు

'ఆయన దేవుడులాంటివాడు, లేవగానే ఆయనకు మొక్కాలి.' అని ఎవర్ని గురించి అయినా అనుకొన్నామంటే-ఆతడు ఉత్తముడు అన్నమాట! తన కేదయినా మంచిచేస్తేనే యిలా అనుకోవడంకాదు. అందరికి మేలుచేసినవార్ని, ఉన్నత భావాలు కలవార్నీ గురించే ఇలా అనుకొంటాం.

ఈ విధంగా ప్రజల గౌరవాన్ని పొంద దగినవాడు నలుగురంటే నలుగురే ఉన్నారట! వారెవ్వరో యోచిద్దాం. కరవుకాటకాలవల్ల ప్రజలు తిండి లేక మల మల మాడిపోతూ ఉంటారు. ధరవరలు ఆకాశాన్ని అంటుతూ వుంటాయి. అట్టి సమయంలో ఐశ్వర్యం వున్నవారే సుఖంగా కాలం గడపగలరు. అట్టి స్థితిలో తిండిలేని జనానికి అన్నంపెట్టే మహానుభావుడే ప్రశంసార్హుడు.

దుర్భిక్షంలేకుండా దేశం సుభిక్షంగా వుండవచ్చు. సరసమైన ధరలకే ఆహార పదార్థాలు, తదితర వస్తువులు దొరకవచ్చు. కాని వాటిని కొనుక్కోవడానికి డబ్బులేని వారు ఎందరో ఉంటారు. అలాంటివారికి ఆ సమయంలో డబ్బు ఇచ్చే ఉదారుణ్ణి చెయ్యెత్తి నమస్కరించాలి.

వీరిద్దరే కాకుండా మరొక ఉత్తముడున్నూ ఉన్నాడు.

ఇతర రాజు తన దేశాన్ని ఆక్రమించడానికి వస్తాడు అనుకోండి. అప్పుడు స్వదేశాన్ని రక్షించుకోడానికి యుద్ధం చేయవలసివస్తుంది. మొదట్లో ఉత్సాహంవల్ల

చాలమంది సిద్ధపడవచ్చు. కాని తీరా యుద్ధం చేయవలసిన సమయంలో అధైర్యపడి వెనకకు రావచ్చు. అలా అధైర్యపడకుండా ధైర్యంతో నిలిచేవారు తక్కువ. ఆ విధంగా నిలిచిన వీరుడు ప్రశంసార్హుడు.

అందరూ సంసార సంబంధమైన చిక్కులలో చిక్కుకొనేవారే! అప్పులు చేస్తేనే గాని రోజులు గడవకుండా వుంటాయి. ఎట్టి పరిస్థితిలోనైనా అప్పుచేయకుండా ఉన్న దానితో తృప్తి పడేవాడున్నూ మొక్కదగినవాడే.

ఈ విధంగా ఈ నలుగురూ ప్రజల గౌరవాన్ని చూరగొంటారని యీ శ్లోకం చెపుతూవున్నది-

'దుర్భిక్షే చాన్నదాతారం
సుభిక్షే చి హిరణ్యదమ్
చతురోఽహం నమస్యామి
రణేధీరం ఋణేశుచిమ్'

దుర్భిక్షసమయంలో అన్నదానం చేసేవానినీ, సుభిక్షంగా ఉన్నప్పుడు ధనం ఇచ్చేవానినీ, యుద్ధంలో ధైర్యం చూసిన వానినీ అప్పులేనివాడినీ-ఈ నలుగురి మొక్కుదును; అని దీని అర్థం.

## మూడు ఉత్తమ గుణాలు

మనం ఆచరణలో పెట్టవలసిన మంచి గుణాలు ఎన్నో ఉన్నాయి. అన్నింటినీ అలవరచుకోవడం సాధ్యం కాకపోవచ్చు. అన్నింటినీ కాకపోయినా కొన్నిటినయినా ఆచరణలో పెట్టుకోవడం సాధ్యపడుతుంది.

ముఖ్యంగా మూడు ఉత్తమ గుణాలు అవసరమైనవి. ఆ మూడింటినీ స్వాధీన పరచుకొంటే మానవునికి విరోధులన్నవారు ఉండరు. అందరిలోను గొప్ప పేరు తెచ్చుకో వచ్చును.

గాంధీమహాత్ముని జీవితంలో ప్రాముఖ్యాన్ని వహించినవి మూడు ఉత్తమ గుణాలు! అవి-చెడ్డమాటను మాటలాడకుండడమూ, చెడ్డమాటను వినకుండా ఉండడమూ, చెడ్డదానిని చూడకుండా ఉండడమున్నూ.

మంచిగా మాటలాడితే అందరూ గౌరవిస్తారు. చెడ్డగా మాటలాడితే అందరూ నిందిస్తారు. దుర్జనుడనే పేరు తెచ్చుకోవడం చాలా సులభమనీ, మంచివాడనే పేరు

ఎంతో కష్టపడితేనే కాని రాదని నీతివేత్తలు చెప్తారు మంచిగా మాటలాడడం చేతకాక పోతే ఊరుకోవడం ఉత్తమం. చెడ్డమాటలు మాట మాత్రం నోటంటరాకూడదు.

ఆ విధంగానే-చెడ్డమాటలు మాటలాడకుండా వున్నంతమాత్రాన సరిపోదు. ఎవరయిన అట్టి మాటలు చెప్తూవుంటే వానిని వినడం కూడా ఉచితం కాదు. కాళిదాసు—

'న కేవలం యో మహతో౽పభాషతే.

శృణోతి తస్మాదపి యఃసపాపభాక్'

అని పెద్దవాళ్లను నిందించిన వాళ్లకే కాకుండా, అలా నిందిస్తూ ఉండగా విన్నవాళ్లకు కూడా పాపం వస్తుంది — అని చెప్పి ఉన్నాడు. అందువల్ల ఇతరులు చెడ్డమాటలు పలుకుతూ వుండగా వినడంకూడా ఉచితము కాదు.

ఇట్టివి వినడం ఎంతఅనుచితమో చెడ్డవాటిని చూడడం కూడా అంత అనుచితమే. అందువల్లనే సహృదయులూ, మెత్తని మనస్సు కలవారు ఏదైనా అసందర్భమైన కష్టమైన పని జరుగుతూ ఉంటే ఆ వైపునకు పోరు. సమీపంలో ఆ పని జరుగుతూ ఉంటే అటు చూడక ముఖం ప్రక్కకు తిప్పుకుంటారు.

అందువల్ల చెడ్డమాటాడము. చెడ్డను వినము. చెడ్డను చూడము - అని నియమం పెట్టుకోవాలి.

మహాత్ముడు మూడు మర్కట రూపాలను మిక్కిలి ఆదరించేవాడు — నోరు మూసుకుంటున్న దొకటి. కన్నులు మూసుకుంటున్న దొకటిన్నీ, చెవులు మూసుకుంటున్నది మరొకటిన్నీ. వాటి అభిప్రాయం — చెడ్డను మాటాడననిన్నీ, చెడ్డను విననని. చెడ్డను చూడననిన్నీ.

## మిత్రుడు ఎలా ఉండాలి?

మనం మిత్రులని అనుకునే వాళ్ళు అందరూ మిత్రులు కారు. కొందరు అవతలి వాళ్ళ అమాయకత్వం ఆధారం చేసుకుని, తమ కార్యాలు నెరవేర్చుకోవడం కోసమై మిత్రత్వాన్ని నటించి, అవసరం తీరిన వెంటనే కనపడకుండా వెళ్ళిపోతారు, కొందరు డబ్బు ఉన్నంత కాలం అభిమానం నటిస్తూ వుండి, ఆ తర్వాత చల్ల చల్లగా జారుకుంటారు. ఇట్టివారు మిత్రులని నమ్మకూడదు.

నిజమైన బంధువులు ఎలాంటి వారో ఇది వరలో తెలుసుకున్నాం. నిజమైన బంధువుకీ, నిజమైన మిత్రుడుకీ ఎక్కువ తేడా ఉండదు. నిజమైన బంధువులో మైత్రి

కూడా కలిసి ఉంటుంది. ఆ విధంగానే నిజమైన మిత్రుడిలో బంధుత్వం మేళవించి ఉంటుంది.

యథార్థమిత్రునిలో ఎన్నో ఉత్తమగుణాలు ఉంటాయి. అన్ని గుణాలు అందరిలోనూ ఉండక పోవచ్చును. కాని ముఖ్యమైన లక్షణాలు ఆరు ప్రసిద్ధంగా ఉన్నవి. ఆ లక్షణాలేవో ఈ శ్లోకం తెలియజేస్తూఉన్నది.

'దదాతి ప్రతిగృహ్ణాతి
గుహ్య మాఖ్యాతి పృచ్ఛతి
భుంక్తే భోజయతీత్యేవం
షడ్విధం మిత్రలక్షణమ్

యధార్థమైన మిత్రుడు అవసరమైన వస్తువును గాని ధనాన్నిగాని ఎట్టి సంకోచమూ లేకుండా యిస్తాడు. ఆ విధంగానే తనకు కావలసినప్పుడు మిత్రుని వద్ద నుండి మొగమాట మనేది లేకుండ వస్తువునుగాని, సొత్తునుగాని తీసుకుంటాడు.

అట్టి మిత్రుడు ఇతరులకు చెప్పకూడని రహస్య విషయాలను తన మిత్రునికి నిస్సంకోచంగా తెలియ చేస్తాడు. ఆ విధంగానే మిత్రుని రహస్యాలను అడిగి తెలుసు కొంటాడు. ఎందుకంటే - తన రహస్యాలు తెలిపితే వాటిలో తన చిక్కులేమయినా ఉంటే వాటిని నివారించ డానికి తగిన సలహా ఇవ్వవచ్చు. అట్లే మిత్రుని కష్ట సుఖాల లోతుపాతులను తెలుసుకుని వాటి పరిష్కారమార్గం ఆలోచించి మనస్సుకు శాంతిని కలిగిస్తాడు. ఇది మిత్రునికి తప్ప మరొకనికి సాధ్యం కాదు.

నిజమైన మిత్రుడు వేరేబుద్ధి లేకుండా ఉంటాడు. కాబట్టి, తనకు కావలసి నప్పుడు అడిగి పెట్టించుకుని తింటాడు. ఆ విధంగానే బలవంతం చేసి అయినా మిత్రుడు తనయింట్లో భుజించేటట్లు చేస్తాడు, ఎంతో అభిమానం ఉంటేనేగాని యిలా జరగదని అందరికీ తెలుసును.

మిత్రుడనే వారిలో ఈ గుణాలు తప్పకుండా ఉంటాయి. ఇవి లేనప్పుడు - అట్టి మిత్రుడు సరియైన మిత్రుడు కాడనీ, అవసరాన్నిబట్టి మైత్రిని నటించే వాడు మాత్రమే అని గ్రహించవలసి యున్నది.

## మనం కోరని సాక్షులు

ఏదయినా అభియోగం ఎవరిపయి నయినా తెచ్చామంటే - మనం చెప్పేదానికి బలాన్ని కూర్చే సాక్షులను కోర్టుకు తీసుకుని వెళ్తాము. తమకు రావడానికి అవకాశం లేదని వారు చెప్తూ ఉన్నా, ప్రాధేయ పడి, భృత్య ఖర్చులు కూడా ఇస్తాము. ఇలా ఇవ్వడానికి కోర్టు అనుమతిని ఇస్తుంది. ఇదే విధంగా ప్రతివాది కూడా. తన వాదానికి అనుకూలంగా సాక్షులను న్యాయస్థానంలో హాజరు పెడతాడు. ఇరుపక్షాల న్యాయవాదులూ తమ తమ పార్టీల పక్షాన వాదిస్తారు, వారు వాదించే వాట్లోనూ, సాక్షులు చెప్పేవాట్లోనూ ఉండే సత్యాసత్యాలు నిర్ణయించడం సులభమేమీ కాదు. ఇది అందరికీ తెలిసినదే !

మానవుడు రెండవ కంటి వానికి తెలియకుండా ఏవైనా పనులు చేసి, అవి ఎవ్వరికీ తెలియవని భ్రాంతి పడవచ్చు. మనం కోరక పోయినా ఆ పనులను కని పెట్టి సాక్షీభూతులైన వారు లేకపోలేదు. మొదట్లో తన అంతరాత్మకీ తెలుస్తుంది. అదే కాకుండా ఆ పనికి సాక్ష్యం ఇచ్చేవారికొన్ని ఉన్నాయి. అవి -

' ఆదిత్యచంద్రా వనలోఽనిలశ్చ
ద్యౌ ర్భూమిరాపోహృదయం యమశ్చ,
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే
ధర్మశ్చ జానాతి వరస్య వృత్తమ్.'

మానవుని ప్రవర్తన ఎలా ఉన్నదీ - అతడు ఎంత దాచినా అతని ఆత్మకు తెలియక తప్పదు. ఆ విధంగానే ఆ ప్రవర్తనను సూర్యుడు, చంద్రుడు, వాయువు అగ్ని, ఆకాశం, భూమి, నీరు, యముడు, పగలు, రాత్రి, ఉదయకాలం, సాయం కాలం, ధర్మము కనిపెట్టుతూనే ఉంటాయి. ఈ విధంగా పధ్నాలుగు సాక్ష్యమిస్తూ ఉండగా, తాను చేసినది ఎవ్వరికీ తెలియదనుకోవడం పొరపాటు. ఈ విషయాన్నే శకుంతల ' నిన్ను నేను వివాహ మాడలేదు ' అని నిండు సభలో చెప్పిన దుష్యంతుని గురించి ' పురుషవృత్త మెఱుంగుచును కడుఁజూవె వేదములును పంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్, యముడును చంద్ర సూర్యులు నహంబును రాత్రియు నన్ మహా పదార్థము లివి యుండగా నరుడు దక్కొన నేర్చునె తన్ను ముచ్చిలన్' అని పలికింది. ఆమె చెప్పిన సాక్షులలో కొంత మార్పు ఉండవచ్చును. కాని సాక్ష్యం ఇవ్వడంలో భేదం లేదు.

మానవుడు ఏమి చేసినా ముఖ్యంగా తన అంతరాత్మ బాగా తెలుసు కుంటున్న సంగతి మరచిపోకూడదు.

## అధికారి ఎలా ఉండాలి ?

అధికారం నిర్వహించే వారు తమ కృత్యాలను సక్రమంగా నేరవేర్చుకొనడం తోనే సరిపోదు. వారు ప్రజాదరాన్ని పొందాలి. దాన్ని పొందడానికి - తగిన సౌక ర్యాలు కలిగించడం తోనే తీరిపోదు. తన హోదాకు తగినట్లు ఉండాలి. ప్రజలకు తన్ను చూడాలనే కుతూహలం ఉండేటట్లున్నూ ఉండాలి. కేవలం మెత్తని స్వభావం విశాల హృదయం కలిగివుంటే సర్వజనసులభుడుగా వుండవచ్చును. కాని అలా సౌలభ్యం ఇస్తే దగ్గరున్న వాళ్ళకు చాల తేలిక అయిపోతాడు. అందువల్ల వారికి కొంత అలక్ష్య భావం ఏర్పడుతుంది. 'మన అధికారి చాలా మెత్తనివాడులే. మనం ఎలా ప్రవర్తించినా ఏమీ అనడు ' అనే అభిప్రాయం కలుగుతుంది. అలా కాకుండా మిక్కిలి కఠినంగా ప్రవర్తిస్తే - అతని దగ్గరకు వెళ్ళడానికే అందరూ భయపడతారు.

ఆ కారణం వల్ల అందరూ తన్ను చూడడానికి కుతూహల పడేటట్లూ ప్రవర్తిం చాలి. దగ్గర చేరడానికి కొంత బెదరుతూ ఉండేరీతిని చూచుకోవాలి. ఎలాగంటే - సముద్రంలో గొప్ప విలువైన ముత్యాలు ఉంటాయి. అందువల్లనే దానికి 'రత్నాకర' మనే పేరు వచ్చింది. రత్నాలపై ఉండే ఆశవల్ల సముద్రం మీదకు పోవాలని వుం టుంది జనులకు. ఆ రీతినే సముద్రం వారిని ఆకర్షిస్తుంది కాని సముద్రంలో ఉండే భయంకరములైన జలచరాలను తలచుకొంటే - ప్రాణభయం వల్ల సముద్రాన్ని చేరవలెననే బుద్ధి పుట్టదు ఈ విధంగా సముద్రం రత్నాలను బట్టి జనుల్ని ఆకర్షిం చనూ ఆకర్షిస్తుంది - దగ్గరకు చేరడానికి భయాన్నీ కలిగిస్తుంది.

ఈ రీతిగానే అధికారి తన పరోపకార బుద్ధి వల్లనూ, న్యాయప్రవర్తన వల్లనూ జనులను ఆకర్షిస్తూ ఉండాలి. అలా అని సౌలభ్యాన్ని వెల్లడించకుండా - తన్ను సమీపించటానికి కొంత వరకూ జనం భయపడుతూ ఉన్నట్టూ ప్రవర్తించాలి.

పూర్వకాలంలో పరిపాలకులైన రాజులు ఈ విధంగానే ఉండినట్లు తెలుస్తుంది. మహాకవి కాళిదాసు రఘువంశంలో దిలీప మహారాజును వర్ణిస్తూ ఈ రీతిగా చెప్పాడు.

'భీమ కాంతై ర్నృపగుణై ః
స బభూ వోపజీవినామ్'

అధృష్యశ్చాభి గమ్యశ్చ
యాదో రత్నై రివార్ణవః ;

దిలీపమహారాజు, భీతిని కలిగించు గుణములచే ఆశ్రితులకు సమీపింప శక్యము కాకుండను, మనోహరములైన గుణముల వలన సమీపింప వలెనను కోరిక కలిగించు నట్లును ప్రవర్తించు చుండెను. ఎట్లనగా - సముద్రము క్రూరములగు జలచరములచే సమీపింప రానిదైనను. రత్నములనుబట్టి ఆకర్షించు చుండును గదా! ఇట్లుండుట రాజుల లక్షణము - అని దీని యభిప్రాయము.

## అనృతం కూడా సత్యమే

భాగవతంలోని ' వారిజాక్షులందు వైవాహికము లందు,' అనే పద్యాన్ని చాల మంది వినే ఉంటారు. స్త్రీలను ఆపదల నుండి కాపాడవలసి వచ్చినప్పుడూ, వివాహ ములు కుదిర్చే సందర్భంలోనూ, ప్రాణాలకూ, ధనానికీ, మానానికి అపాయం కలిగే టట్లయితే దాన్ని తప్పించుకొనే టందుకూ, భయపడిన గోవులనూ , అగ్రజన్ములనూ రక్షించవలసినప్పుడూ అబద్ధం ఆడవచ్చునని దాని అభిప్రాయం. అబద్ధం ఆడితే పాపం సంభవిస్తుంది. కాని, పయిసందర్భాలతో పలికిన బొంకు వల్ల మాత్రం పాపం కలగదని ఆప్తవాక్యం.

అలాంటి సందర్భాల్లో ఆడిన అసత్యం వల్ల పాపం కలగక పోవచ్చును కాని 'కుక్క గోవు కాని'విధంగా అసత్యం అసత్యమే కాని సత్యం ఎంతమాత్రమూ కాదు.

అందువల్ల కొందరు సత్యవాదులు - పాపం లేక పోయినా - అసత్యం పలికి - పయి విషయాలలో జోక్యం కలుగ చేసుకోడానికి వెనక తీస్తారు.

ఇట్టివారికి పరోపకారం చెయ్యడంలో ప్రోత్సాహం కలిగించడానికి అసత్యం అవసరమైన సందర్భాలలో పాపం లేకపోవడం సరేకదా ఆ అసత్యం సత్యమే అని చెప్ప వలసి వుంటుంది. దాన్ని బట్టే ఈ పద్యం ఏర్పడింది.

'ఉన్నది కన్నది విన్నది
యున్నట్లుగఁ బలుకునయును బిరులకు సత్యా
సన్నత కలుగఁగఁ గల్యా
ణోన్నతిగల కల్లమాటయును సత్యమగున్.

ఉన్నదానిని ఉన్నట్లూ, చూచిన దానిని చూచినట్లూ, విన్నదానిని విన్న మాదిరి గానూ చెప్పడం సత్యం అవుతుంది. ఆ విధంగానే ఇతరులకు గొప్ప ఆపద కలిగి నప్పుడు, ఆ ఆపదను పోగొట్టి వారికి మేలునూ, శుభాన్నీ కలిగించడానికి ఆడిన అబద్ధమున్నూ సత్యమే అవుతుంది కాని అసత్యం కాదు అని దీని అభిప్రాయం.

భాగవతంలోని పద్యంలో ఎలాంటి సందర్భాల్లో అబద్ధం ఆడవచ్చునో వివ రించ బడింది. ఈ పద్యంలో సత్యం స్వరూపం ఎటు వంటిదో చెప్పబడడమే కాకుండ - ఆయా సందర్భాలను పేర్కొకుండా - సర్వసామాన్యంగా - జాతి మతాది భేదాలు, పక్షపాతాలూ లేకుండా, ఆపదలో ఉండేవారిని అందరినీ వాటినుండి రక్షించి, వారికి శుభాన్ని కలిగించడం కోసం ఆడే అబద్ధం సత్యమే అవుతుందని చెప్పడం ఎంతో ఉచితంగా ఉన్నది.

అన్ని రంగాల్లోనూ అభ్యున్నతి కావలసిన ఈ కాలంలో ప్రతిభావంతులైన రాజకీయవేత్తలూ, నాయకులూ, సమయానుకూలంగా స్వార్థం కోసం సత్యాన్ని అసత్యంగానూ, అసత్యాన్ని సత్యాన్నిగానూ మార్చివేస్తూ వుండడం అందరికీ తెలుసు. అట్టి స్థితిలో పరోపకారార్థమైన అసత్యం సత్యం కావడం ప్రశంసనీయమే!

## ఆత్మశుద్ధి

మనం పరిశుద్ధంగా ఉండాలంటే - మొదట శరీరం పరిశుద్ధంగా ఉండాలి. తర్వాత ఆత్మను పరిశుద్ధం చేసుకోవాలి.

శరీరం పరిశుద్ధం చేసుకోవడానికి స్నానాదులు, అనులేపాదులు ఉన్నవి. వాటి వల్ల దాన్ని పరిశుద్ధంగా ఉంచుకోవడం సులభం.

ఆత్మను పరిశుద్ధంగా ఉంచుకొనుట అంత సులభమైనది కాదు.

ఆత్మ పరిశుద్ధికి విద్య ఎంతో ఉపకరిస్తుంది. విద్యవల్ల యుక్తా యుక్త వివేకం - జ్ఞానం కలిగి తన్మూలంగా ఆత్మకు నైర్మల్యం కలుగుతుంది.

చంచలం కాకుండా స్థిరంగా మనము వుంటే, అది ఆత్మశుద్ధికి ఎంతో దోహదం యిస్తుంది. మనస్సు స్థిరంగా వుండడానికి తపస్సు ముఖ్యం.

ఈ రీతిగానే ప్రాణాయామం మూలంగానూ ఆత్మపరిశుద్ధి ఏర్పడ గలదు.

తీర్థాటనం వల్ల ఆత్మకు సంతృప్తి కలిగిన అది నిర్మలంగా ఉండటానికి అవ కాశం వున్నది,

అభిషేకం వల్ల కూడ ఆత్మ సంతృప్తి కలగవచ్చు.

ఇంతేకాదు —

వ్రతాలు చెయ్యడం వల్లనూ, దాన ధర్మాల వల్లనూ ఆత్మకు తృప్తి కలగ గలదు. అందు వల్ల పరిశుద్ధత ఏర్పడ గలదు.

ఆత్మ పరిశుద్ధి కిటువంటి మార్గాలు లేక పోలేదు.

వయివాని మూలంగా అంతరాత్మకు పరిశుద్ధి కలుగుతుంది అది సంపూర్ణమైనది కాదు.

అది అత్యంతమూ పరిశుద్ధంగా ఉండాలంటే హృదయంలో ఆద్యంత రహితు డయిన భగవంతుడు తిష్ట వేసుకుని కూర్చోవాలి. అంటే - తక్కిన వాటికి ప్రాధాన్యం ఇవ్వకుండా-భగవద్ధ్యానానికే ప్రాధాన్య మిచ్చి ఇతర చింతలు లేకుండా ఉండాలి.

ఆత్మ పరిశుద్ధంగా ఉండాలంటే-భగవంతుణ్ణి సదాధ్యానం చేస్తూ-వేరే ఆలోచన లను విడిచి పెట్టాలి.

ఈ విషయాన్నే ఈ శ్లోకం చెప్పుతూ ఉన్నది-

'విద్యా తపః ప్రాణవిరోధ మైత్రీ
తీర్థాభిషేక వ్రత దాన జప్యైః
నాత్యంత శుద్ధిం లభతేఽంతరాత్మా
యథా హృదిస్థే భగవత్యనంతే'

'విద్యవల్లగాని, తపస్సువల్లగాని, ప్రాణాయామం మూలంగాగాని, మైత్రివల్ల కాని, తీర్థాభిషేకాలవల్లగాని, వ్రతములూ దానధర్మాలు చెయ్యడం మూలంగాగాని అంతరాత్మకు కొంత పరిశుద్ధి కలగవచ్చు. హృదయంలో అనంతరూపుడైన భగవం తుడు ఉన్నప్పుడు మాత్రమే అవికలుగుతుంచి,' అని దీని అభిప్రాయం.

భగవద్ధ్యానానికి ఎంత ప్రాముఖ్యమున్నదీ దీనివల్ల తెలుసుకోవచ్చు.

## ఇతరులకు చెప్పకూడనివి

ఎంత ఆప్తులుగాఉన్నా-వారికి కూడా చెప్పకుండా దాచదగినవి కొన్ని ఉన్నవి. నీతి చంద్రికలో చిన్నయసూరిగారు-అర్థనాశం, మనస్తాపం మొదలయిన కొన్నిటిని మాత్రము చెప్పారు. కాని దాచి ఉంచదగినవి తొమ్మిదని విద్వాంసులు చెపున్నారు-

ఆయు ర్విత్తం గృహచ్ఛిద్రం
మంత్ర మౌషధ సంగమౌ
దాన మానావమానాశ్చ
నవ గోప్యా మనీషిభిః!

ఆయుస్సు, ధనం, కుటుంబంలోని కీచులాటలు, మంత్రం, ఔషధం. ఇతరులను కలుసుకుని మాటలాడిన విషయం, ఇతరులకిచ్చే దానం తనకు ఇతరులు చేసిన మర్యాద తనకు కలిగిన అవమానం-ఈ తొమ్మిదింటినీ ఇతరులకు విద్వాంసులు చెప్పకూడదని దీని అభిప్రాయం.

వయస్సుని కొంతదాచి-అంటే కొంత తగ్గించి చెప్పడం ఆచారంలో ఉన్నది. ఉన్న వయస్సును ఉన్నట్లుగానే చెబితే వివాహాదుల్లోను, ఇతర విషయాల్లోను చిక్కులు కలగవచ్చు. సరియైన వయస్సు చెప్పకపోతే-దాన్ని ఇచ్చవచ్చినట్లు మార్చుకోడానికిన్నీ అవకాశం ఉంటుంది.

వయస్సును దాచినట్లే-దగ్గర ఎంత ధనం ఉన్నదో చెప్పకుండ ఉండడం సహజం. ధనం ఉన్నట్లు తెలిస్తే-ఇతరులు పీక్కుని తింటారు. ధనం లేనట్లు తెలిస్తే-అట్టివానికి అప్పుపుట్టదు.

ఇంటి విషయాల్లో ఏవో అభిప్రాయ భేదాలు, చిన్న చిన్న కలహాలు ఉండ వచ్చును. అవి నలుగురికి తెలిస్తే-నలుగురిలోనూ ఉండే మంచి పేరు దెబ్బతింటుంది.

ఏదయినా మంత్రం వేసేటప్పుడు ఆమంత్రాన్ని బయటికి ఉచ్చరిస్తే ఆ మంత్రం విలువ పోతుంది. అది పని చెయ్యకపోవచ్చు. మంత్రం మీది గౌరవం నశిస్తుంది.

వైద్యుడు రోగికిచ్చేమందు, విలువ తక్కువదీ, అందరికీ తెలిసేది కావచ్చు. అయినా అది ఫలానా మందు అని వైద్యుడూ చెప్పకూడదు. 'ఏం మందు?' అని రోగీ అడగకూడదు. తెలిస్తే 'ఇదేనా? ఏమో అనుకున్నాను' అనే నిరసన భావం, అందువల్ల అది పనిచెయ్యకపోవడం ఇట్టి అనర్థాలు కలుగుతాయి.

ఆ విధంగానే ఏదో కార్యం నిమిత్తం ఎవరిని కలుసుకున్నా, లేదా - స్త్రీసంగ మాన్ని గురించి అయినా బయటికి చెప్పకూడదు.

ఇతరులకు దేన్ని ఇచ్చినా దానం చేసినట్లు గొప్పగా చెప్పుకోకూడదు. అందు వల్లనే ఉత్తములు గుప్తదానాన్ని చేస్తారు. ఏమి ఇచ్చినదీ ఎవ్వరికీ తెలియకుండా అది నిరాడంబరత్వానికి గురుతు.

ఇట్లే తన్ను, ఎవ్వరైనా గౌరవించినా 'ఇంత గొప్ప గౌరవం పొందాను' అని చెప్పకూడదు. ఇది అహంభావాన్ని సూచిస్తుంది.

ఇతరులు తనను అవమానించినా-ఏమి ఎరగనట్లు ఊరికే ఉండాలి-కాని నలుగురితో చెప్పకూడదు. తెలియకుండా ఉన్నంతకాలం తన మనస్సుకీ ఎక్కువ బాధ కలుగదు. తెలిస్తే నలుగురిలో నవ్వుబాటు-అంతులేని విచారమున్నూ.

అందువల్ల ఈ తొమ్మిదింటినీ గుప్తంగా ఉంచటంమేలు.

## ఏషధర్మః సనాతనః

ప్రాచీనకాలం నుంచి మనవారందరూ ఆచరిస్తూ ఉన్న ధర్మం సనాతన ధర్మమని ప్రసిద్ధి కెక్కినది. ఈ ధర్మం ఒకదేశానికి కాని, ఒక కాలానికి కాని, ఒక మతానికికాని సంబంధించినది కాదు. అన్ని మతాలవారూ, అన్ని జాతులవారూ ఏ చోట ఉన్నా, ఏ కాలంలో అయినా ఆచరింప దగినదే! అత్యంతహితమైనదే! అదే—

'సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్సత్య మప్రియమ్
ప్రియం చ నానృతం బ్రూయాత్
ఏషధర్మః సనాతనః'

అనేది మనుధర్మ శాస్త్రంలో ఉన్నది.

ఎప్పుడూ నిజాన్నే చెప్పాలి. అసత్యాన్ని చెప్పకూడదు. మనం ఇతరులకు చెప్పేమాట వారికి ఇష్టమైనదిగా ఉండాలి, అంటే ఏ మాట చెప్తే ఇతరులకు ప్రియంగా ఉంటుందో దాన్నే చెప్పాలి

ఆరీతిగానే అనిష్టంగా ఉన్న సత్యాన్ని చెప్పకూడదు. అట్టి స్థితిలో అబద్ధాన్ని చెప్పినా తప్పులేదు.

ఒకరికి ప్రియంగా మాటలాడ వలెనని సంకల్పం ఉన్నా - ఇతరులకు తృప్తి కలిగేటట్లు అసత్యపు మాటలు చెప్పినట్లయితే - వారిని మోసపుచ్చినట్లే అవుతుంది. అందువల్ల మెహర్బానీకోసం అబద్ధపు కూతలు కూయకూడదని పెద్దలు చెప్తున్నారు. ఇది ఒక మందలింపని గ్రహించవలసి ఉన్నది.

ఇతరులతో సంభాషించేటప్పుడు పయి విషయాలను బాగా గుర్తుంచు కోవాలి.

అయితే —

సత్యం చెప్పినట్లే అబద్ధం చెప్పినా తప్పులేదని మనం అనుకోకూడదు. అబద్ధం చెప్పాలని ఎవరూ అనరు. చెప్పిన అసత్యంవల్ల ఎవ్వరికీ ఎట్టి బాధ కలగ కుండా ఉండాలి. వారి మనస్సు కలత పడ కూడదు.

సత్యాన్ని వెల్లడించేటప్పుడు ఎదుటివారి మనస్తత్వాన్ని, గ్రహించి, దానికి అను కూలమైన విధంగా నడుచుకోవాలి.

ఇట్టిదే సనాతన మైన ధర్మం!

ధర్మంలోని సూక్ష్మభావం యిదే!

## ఎవడు పండితుడు?

లోకంలో మానవులను రెండు తెగలుగా విడదీయ వచ్చును. ఒకతెగకు చెందిన వాడు రెండవతెగకు ఎంతో దూరం; ఒక తెగవాడు పండితుడు. మరో తెగవాడు పామరుడు. స్పష్టంగా చెప్పవలెనంటే విజ్ఞుడు పండితుడు. అజ్ఞుడు పామరుడు.

బాగా చదువుకున్నవాడు పండితుడనీ, చదువు రానివాడు పామరుడని అందరూ అనుకుంటూ ఉంటారు.

కాని పుస్తకాలు చదివి సంపాదించిన విద్య కంటె అనుభవంవల్ల గడించిన విద్య ఎంతో మేలైనది. చదువుకొనివున్న మూర్ఖులూ ఉండవచ్చు; చదువురాని అనుభవజ్ఞులూ ఉండవచ్చును.

చదువుకొని విద్వాంసులైన కొందరు లోకానికి మంచిని బోధించవచ్చును. కానీ తాము బోధించినట్లు తామే ఆచరించకుండా వుండవచ్చును. వారి పాండిత్యం కేవలం పుస్తక పాండిత్యం :

తాము విద్వాంసులు కాకపోయినా, లోకంలోని ఉత్తముల ఆచరణను గ్రహించి మంచిని తెలుసుకొని లోకానికి మంచిని చేసే పామరులు చదువుకున్న పండితులకంటే ఎంతో మేలు:

ఈ విధంగా ఉత్తమంగా ప్రవర్తించి, లోకానికి మంచి మార్గాన్ని చూపుతున్న వాడే పండితుడు. కాని కేవలం చదువుకున్నవాడు పండితుడు కాదంటూ - అతడు అనుసరించవలసిన ఉత్తమ మార్గాలను మూడింటిని ఈ శ్లోకం తెలియ జేస్తున్నది.

'మాతృవ ర్పర దారాంశ్చ
పరద్రవ్యాణి లోష్ఠవత్
ఆత్మవ త్సర్వ భూతాని
యఃపశ్యతి స పండితః'

ఇతరుల స్త్రీలను తల్లితో సమానంగా చూడవలని ఉన్నది. ఇతరుల సొత్తు ఆశించకుండా దాన్ని మట్టిబెడ్డతో సమానంగా - అంటే నిరుపయోగమైన దానివలెనే చూడాలి. ఇతరుల ప్రాణుల నన్నిటిని - అంటే మనుషులనే కాకుండా మృగ, పక్షి, క్రిమి, కీటకాదులను కూడా తనతో సమానంగా భావించాలి. అంటే తనకు ఏద యినా కష్టం వస్తే - దెబ్బతగిలితే - ఎంతబాధ కలుగుతుందో, అటువంటి బాధే ఇతర ప్రాణులకు కూడా కలుగుతుందని తన అనుభవాన్ని బట్టి తెలుసుకోవాలి. ఇలా తెలుసుకొని వాటిని హింసించకుండా ఉండాలి.

ఈ విధంగా ఈ ఉత్తమ పద్ధతులను మూడింటిని ఆచరిస్తూ ఉన్నవాడే పండితుడు. కాని కేవలం విద్య నేర్చుకొని జ్ఞానం సంపాదించినంతమాత్రాన పండితుడు కాడు.

అని శ్లోకం అభిప్రాయం.

నిజమే ; మానవుడు ఉత్తముడు అని పేరు తెచ్చుకోవాలంటే పయి గుణ త్రయాన్ని ఆచరణలో పెట్టడం అవసరం.

## ఎవరిని ప్రశంసించాలి?

తగినవారిని కొనియాడినప్పుడే అది ప్రశంస అనిపించు కుంటుంది. అట్లు కాకుండా గుణవంతులు కానివారిని గుణవంతులుగా వర్ణించడం ముఖస్తుతి అవుతుంది. ముఖస్తుతి చేయడంలో వ్యక్తికి స్వార్థం కొంతవరకయినా ఉండి తీరుతుంది. అందు వల్ల ముఖస్తుతి చెయ్యడం ఉత్తమ లక్షణం కాదు.

ఉత్తమగుణాలు కలవారిని ప్రశంసించ వచ్చును. ఆ ప్రశంసించడంలోనూ ఔచిత్యాన్ని గమనించాలి. ఎవరిని, ప్రశంసించడం ఉచితమో మన ప్రాచీనులు నిర్ణయించియే ఉన్నారు. ఎవరిని ప్రశంసించ కూడదో - ( అంటే ఉత్తమగుణాలు ఉన్నాకూడా ) స్పష్టపఱచి ఉన్నారు —

'ప్రత్యక్షే గురువః స్తుత్యాః
మరోక్షే మిత్ర బాంధవాః
కార్యాంతే దాసభృత్యాశ్చ
నకదాచన పుత్రకాః'

గురువులను వారియెదుటనే స్తుతించ వలసి యున్నది. బంధువులను, మిత్రులను వారియెదుట కాకుండా పరోక్షంలో కొనియాడవలసి యున్నది. భృత్యులనూ, సేవకులనూ - వారికి అప్పగించిన పనిని పూర్తి చేశాక అభినందించాలి. ఎంత గుణవంతులయి ఉన్నప్పటికీ పుత్రులను ఎన్నటికినీ ప్రశంసించనే కూడదు అని దీని అభిప్రాయం.

గురువులను సన్మానించడం శిష్యుని ధర్మం. ఆరీతిని సన్మానం అందరి యెదుట జరిగితే శిష్యునికి ఆత్మతృప్తి కలుగుతుంది. ఆస్తుతివల్ల గురువునకు ఎక్కువ ప్రయోజనం లేకపోవచ్చును. కాని శిష్యుని కృతజ్ఞత వెల్లడి అవుతుంది.

బంధువులనుగాని, మిత్రులనుగాని వారి యెదుటనే పొగిడితే అది ముఖస్తుతి అనుకోవడానికి ఎంతో అవకాశమున్నది. వారి పరోక్షంలో ప్రశంసించి నప్పుడే అది వాస్తవమైనదిగా నిర్ణయించుటకు వీలుపడుతుంది.

సేవకులకు ఏదయినా పనిని అప్పగించగా వారాపనిని చేస్తూండగా, నడుమ 'మీరు బాగా పనిచేస్తున్నారు' అని మెచ్చుకో కూడదు. పని పూర్తి అయిన తర్వాతనే ప్రశంసించాలి. నడుమనే ప్రశంసిస్తే, వారిలో అలసభావం ఏర్పడవచ్చు. యజమానుని పని తృప్తికరంగా నెరవేర్చకపోతే ఆయనకు కోపం వస్తుందని భయభక్తులలో శ్రద్ధగా కార్యం నెరవేర్చడంలో వారికి శ్రద్ధ ఎక్కువ ఉంటుంది. పనిని జరిగిన తర్వాత ప్రశంసిస్తే - ప్రోత్సాహం కల్గి భృత్యులు కార్యాంతరంపట్ల ఎక్కువ శ్రద్ధ చూపగలరు.

అయితే, పుత్రులెంత గుణవంతులయినా, నలుగురిలోనూ పేరుతెచ్చుకుంటున్న వారిని మాత్రం తండ్రి ఎప్పుడూ ప్రశంసించనే కూడదు. 'పుత్రాదిచ్ఛే త్పరాజయం' అని తన కుమారుడు తనకంటే గొప్పవాడుగా ఉండాలనే తండ్రి కోరుతూ ఉంటాడు. తన్ను మెచ్చుకోలేదని కొడుకు తండ్రి విషయంలో దురభిప్రాయం కలిగిఉండే ఉండు గాక! కొంతకాలానికయినా పుత్రుడు భారవి మహాకవి రీతిని యధార్థాన్ని గ్రహించ గలడు.

'ఆత్మా వై పుత్రనామాసి' అనేదాన్ని బట్టి తానే పుత్రుడుగా జన్మిస్తాడు గదా! కుమారుణ్ణి పొగడితే తన్నుతాను పొగడుకొన్నట్లే అవుతుంది. ఆతనిస్తుతి ఎంత మాత్రమూ తగదు.

## - గౌరవాన్నిచ్చేవి -

మనుష్యుడు గొప్పవంశంలో పుట్టినా, గొప్ప పదవిలోఉన్నా గౌరవం కలగడం సహజం. అట్టి యోగ్యతలు లేక సర్వసాధారణంగా గౌరవం సంపాదించవచ్చును. అలా గౌరవాన్నిచ్చేవి అరుదు.

మనిషి ఎట్టి స్వభావం కలవాడయినా-అతని దగ్గర డబ్బు ఉన్నట్లయితే అతన్ని అందరూ గౌరవిస్తారు. డబ్బుఉన్నచోట దేవుడు ఉంటాడనే సామెత ఉండనే ఉన్నది.

అసలు వ్యక్తి ఏ విధంగానూ మెచ్చదగినవాడు కాకపోవచ్చు. కాని అతనికి తగిన బలగం-అంటే బంధుబలం ఉంటే వారిని బట్టి గౌరవం కలుగుతుంది. 'ఈయన సామాన్యుడు కాదండోయ్! ఫలానా వారు ఇతని బంధువులు!' అని అందరూ చెప్పు కొని అతన్ని గౌరవిస్తారు.

ఆ విధంగానే వయస్సునుబట్టి కూడా గౌరవం ఏర్పడుతుంది. విద్యలేకపోయినా వయోవృద్ధులను అందరూ గౌరవిస్తారు. ఎక్కువ కాలం లోకాన్ని చూస్తూ ఉండడంవల్ల వారికి లోకానుభవం ఉంటుంది. 'పెద్దలను గౌరవించాలి' అనే నానుడి అందరూ ఎరిగినదే!

ఈ మాదిరిగానే గౌరవాన్ని సంపాదించడానికి మనముచేసే ఉత్తమ కార్యం కారణమవుతుంది. ధైర్యసాహసాలను ప్రదర్శించి యేదైనా అసాధ్యమైన పనిచేసినా, లేదా పరోపకారమైన కృత్యాన్ని నెరవేర్చినా జనం హర్షించి గౌరవించగలరు.

గౌరవాన్నిచ్చే వాటిలో విద్య కూడా ముఖ్యమైనది. విద్వాంసుడు వికార స్వరూపంతో ఉన్నా విశేష గౌరవాన్ని పొందుతాడు. ఈ రీతిని మనకు గౌరవాన్నిచ్చే యోగ్యతలు అయిదు ఉన్నవి. ఈ అయిదింటిలో పరస్పరం వ్యత్యాసముంటున్నది. అన్నీ సరిసమానాలు కావు. అంతేకాదు. ఒకదానికంటే మరొకటి ఉత్తమమైనది. అంటే- ధనం కంటే బంధువులు ఉత్తములు, బంధువుల కంటే వయస్సు. వయస్సు కంటే ఉత్తమకార్యం, ఆ ఉత్తమకార్యం కంటే విద్య హెచ్చయినది. బాగా ఆలోచిస్తే తక్కిన వన్నీ విద్యకు లోకువ అన్నమాట-

ఈ శ్లోకం యీ విషయాన్నే తెలియజేస్తున్నది-

'విత్తం బందు ర్వయః కర్మ
విద్యా భవతి పంచమాః
ఏతాని మాన్యస్థా నాని
గరీయో యద్య దుత్తమమ్.'

మనకు గౌరవాన్ని కలిగించేవి-ఒకటి-ధనం; రెండు-బంధువర్గం; మూడు-వయస్సు; నాలుగు-ఉత్తమ కార్యం; అయిదవది-విద్య. ఇవన్నీ గౌరవదాయకాలయినా క్రమంగా ఒకదానికంటే మరొకటి గొప్పదీ ఉత్తమమున్నూ-అని దీని అభిప్రాయం.

## ఎవరు శిష్టులు ?

"శిష్టులు" అనేమాట తరచుగా వినబడుతూ ఉంటుంది. తక్కిన వారికంటె వారిని గౌరవంతో చూడడం సంప్రదాయంగా ఉన్నది. ప్రాచీన సంప్రదాయాలను అనుసరిస్తూ. నిష్ఠతోనూ, నియమాలతోనూ ఉన్నవారు శిష్టులనీ వారు సామాన్య జనులతో కలిసి మెలిసి ఉండకుండా కొంచెం దూరంగా ఉంటారనీ, లౌకిక విషయాలతో ఎక్కువ సంబంధం పెట్టుకోరనీ, నవీన పద్ధతులు వారికి కిట్టవనీ జనుల భావన.

శిష్టులంటే సదాచార వంతులని చాలమంది అభిప్రాయం. అయితే-

శిష్టులు మనం అనుకునే లక్షణాలు కలవారుకారు. ఆ విధంగా మన ప్రాచీనులు చెప్పలేదు.

'శిష్టాః పునరకామాత్మా.'

అని వశిష్ఠవచనము. ఎట్టికోరికలూ లేనివాడు శిష్టుడని దీని అభిప్రాయం. ఎన్ని పూజలు చేసినా, నియమాలు సక్రమంగా పాటించినా మనస్సులో కోరిక అనేది ఉంటే అతడు శిష్టుడని చెప్పడానికి వీలులేదు.

'శిష్టాః ఖలు విగత మత్సరాః, నిరహంకారాః, కబళీధాన్యాః, అలోలుపాః, దంభదర్పలోభ మోహక్రోధవర్జితాః, అని బోధాయనుని వచనం.

శిష్టులైనవారు మాత్సర్యాన్నీ, అహంకారాన్నీ విడిచిపెట్టాలి. ఆహార వస్తువులను ఎక్కువగా నిలువ చేసుకొని ఉంచుకోకూడదు. పది దినాలకు సరిపోయే ధాన్యాన్ని మాత్రమే ఇంట్లో ఉంచుకోవాలి. దేని విషయంలోనూ లోలుపత్వం ఉండకూడదు. అంటే-అది ఉంటే బాగుంటుంది. ఇది వస్తే అనుకూలంగా ఉండేది. అనే భావాలు తలెత్త కూడదు. బడాయి ఎంత మాత్రమూ పనికి రాదు. గర్వం ఉండకూడదు. శిష్టుడు లోభిగా ఉండకూడదు. అతడు మోహాన్ని దగ్గర చేరనివ్వకూడదు. ఎప్పుడూ అతనికి కోపం రాకూడదు. ఇట్టి గుణాలు వున్నవాడే నిజమైన శిష్టుడు కాగలడు.-అని బోధాయనుని సూత్రం అభిప్రాయం.

ఈ ఇద్దరు మహామునుల వాక్యాలూ ఉత్తమ శీలుని స్వభావాన్నీ, స్వార్థ రాహిత్యాన్నీ స్పష్టం చేస్తున్నాయి.

వీటివల్ల ఉత్తమ శీలం కలవాడే శిష్టుడని స్పష్టంగా తెలుస్తూ ఉన్నది.

తాము శిష్టులమని అనుకొనే కొందరు పయి ఉత్తమ గుణాలకు ప్రాధాన్యం ఇవ్వక, బాహ్య స్వరూపానికి, వేషానికి ప్రాముఖ్యం ఇస్తారు.

అట్టివారు శిష్టం మన్యులు కాని శిష్టులు కారు.

## కోరవలసినదేది?

ఒకప్పుడు కాకపోతే, మరొకప్పుడయినా, మనిషికి-తన జీవితం స్థిరంకాదనీ, ఎప్పుడో తానీ శరీరాన్ని విడవ వలసి వస్తుందనీ తెలియకపోదు. అందువల్ల ముక్తిని పొందవలెననే కోరిక ఉండడమున్నూ సహజమే!

ముక్తి అనేది అంత సులభంగా లభించేది కాదు. దానికి ఎంతో పరిశ్రమ, నిష్ఠ మొదలైనవి కావాలి. అవి ప్రయత్న పూర్వకమైనవే కాని ఉన్న పాటున వచ్చేవి కావు ఉదాహరణకు-ఒక మనిషి పడుకున్ని ఉన్నాడను కుందాము. అతనికి పరు

గెత్తాలనే కోరిక కలిగింది. ఆ కోరిక నెరవేరడానికి అతడు ఏమి చెయ్యాలి? మొదట మెల్లగా లేవాలి, లేచి కూర్చోవాలి, తర్వాత నిలవాలి. నిలిచిన తర్వాత పరుగెత్తాలి. అప్పుడే అతనికి పరుగెత్తడం సాధ్యపడుతుంది. పడుక్కున్న పాళంగా పరుగెత్తడం సాధ్యపడదు. ఒకవేళ తొందరపాటున ప్రయత్నించినా- ఆ ప్రయత్నంవల్ల శరీరానికి బాధ కలగడమే తప్ప ఫలితం ఉండదు.

ఆ విధంగానే ముక్తి పొందడానికి ముందుగా జరగవలసిన సాధనాలు ఎన్నో ఉన్నవి. క్లిష్టమైన వాటిని మనం అనుసరించ నక్కరలేదు. తపోనిష్ఠ అక్కర్లేదు. మానవుడు ఉండవలసిన విధంగా మనం నడచుకొన్నప్పుడు-అన్ని విధాలా పురోగతి కలిగి క్రమంగా కొంత కాలానికి సంకల్పం నెరవేరుతుంది.

మానవులమై ఉన్నందుకు మనం నడచుకోవలసిన విధాన మెటువంటిది.

నేనూ మానవ జన్మఎత్తి మానవులు నడచుకొనే విధంగా నడచుకోకపోతే నా జీవితమువల్ల ప్రయోజనం ఏమిటి? అని ఆలోచించి పరార్థ దృష్టిని పెట్టుకోవలసి ఉంటుంది. మానవుడన్న వానికి స్వార్థం లేకుండా ఉండదు. దాన్ని చంపుకోవడం మానవ మాత్రునికి సాధ్యం కానే కాదు. స్వార్థ పరార్థ భావాలు మనలో సమానమైన పాళ్ళలో (అంటే చెరి ఏభయి పాళ్ళలో) ఉన్నాయని అనుకుందాం. అట్టి స్థితిలో మనం స్వార్థంలో ఒకపాలు తగ్గించి, పదార్థం విషయంలో ఒక పాలు హెచ్చించి- ఏభై యొక్కపాలు నిస్స్వార్థత ఉండేటట్లు ప్రయత్నించాలి. అలాక్రమంగా దానిపాళ్ళు హెచ్చిస్తూ స్వార్థపరతపైని వుండే దృష్టిని తగ్గించుకోవాలి. ఆచరణలో పెట్టే సంకల్పం వుంటే యీ ప్రయత్నం సఫలంకాక తప్పదు. అప్పుడు పరాత్పరుని కృప మనం పొందడానికి ఎంతో అవకాశం వుంది. ఆ కృప మూలంగానే తరించే ఉపాయాలు మనకు తెలుస్తాయి. అంతేకాకుండా తరించే ఉపాయాలను అనుభవజ్ఞులవల్ల తెలుసు కొనుటకు ఎంతో అవకాశం వుంది. అట్టి వారు మనం కోరకుండానే మనకు వాటిని తెలియచేస్తారు.

మోక్ష మార్గానికి మొదటి మెట్టు మానవుడు మానవుడుగా ప్రవర్తించడానికి చేసే ప్రయత్నం.

## తాంబూలాన్ని గురించి

మన దేశంలో తాంబూలానికి ఎంతో ప్రాధాన్యం ఉన్నది. షోడశోపచార పూజతో నైవేద్యానంతరం తాంబూలం వస్తుంది. పసుపు విఘ్నేశ్వరునికి పూజ చేసి

నప్పుడున్నూ తక్కిన వాటికి బదులుగా అక్షతలు సమర్పించినా, నైవేద్య, తాంబూలాలు మాత్రం సమర్పించ వలసిందే. తిన్న ఆహారం జీర్ణం కావడానికి తాంబూలం ఆవశ్యకమని వైద్యశాస్త్రంలోనూ ఉన్నది; అనుభవంలోనూ ఉన్నది.

వివాహాదులకు వెళ్ళినప్పుడు విందు భోజనం పెట్టినా, తాంబూలం ఇవ్వకపోతే అగౌరవ పరచి నట్లవుతుంది. భోజనం లేకుండా తాంబూలం యిచ్చినా సంతృప్తి కలుగుతుంది.

వివాహానికి నిశ్చయం చేసుకోవడాన్ని తాంబూలాలు పుచ్చుకోవడమని అంటారు. ఇది తెలుగుదేశంలో అలవాటులో ఉన్న మాట. మద్రాసు ప్రాంతంలో దీన్ని నిశ్చితార్థ మంటారు. తాంబూలాలు పుచ్చుకుంటే సరి— తర్వాత ఆ నిర్ణయానికి తిరుగు ఉండదన్న మాట.

మహారాజుల సభల్లో తాంబూలం లభించినదంటే గొప్ప బిరుదాన్ని సంపాదించిన కంటె ఎక్కువ మర్యాద సంపాదించినట్లు అర్థం. రాజసభల్లో రెండు తాంబూలాలు పొందడం ఎంతో గౌరవాన్ని కలిగిస్తుందని 'తాంబూలద్వయ మాసనంచ లభతేయః కాన్యకుబ్జేశ్వరాత్' మొదలైన శ్లోకాలవల్ల తెలుస్తూ ఉన్నది.

రాజుల ఆస్థానాలలో ఆస్థాన విద్వాంసులూ, కవులూ వుంటారు. ఆ రాజులు తమ కీర్తి స్థిరంగా ఉండడానికి ఆస్థాన విద్వాంసులను కవులను గ్రంథాలను రచించి తమకు కృతిగా ఇవ్వవలెనని కోరుతారు. అలా కోరేటప్పుడు కవిని సమ్మానించడం కోసం కర్పూరతాంబూలాలు ఇవ్వడం సంప్రదాయం. ప్రభువు కవులకు తాంబూలం ఇచ్చాడంటే— మాట తప్పకూడదని కవులను హెచ్చరించడ మన్న మాట.

తెలుగు ప్రబంధాలు చాలా వాటిలో ప్రభువులు తమకు అంకితంగా కృతులను రచించాలని కవులను కోరినప్పుడు 'కర్పూర తాంబూలాలు' ఇవ్వడం కానవస్తుంది.

కవులనే కాకుండా తమ కార్యనిర్వహణకు పూనుకునే వారికి్కూడా తాంబూల మిచ్చే సంప్రదాయం ఉన్నది. ఇది చాలా అరుదుగా కానవస్తుంది. నన్నెచోడుని కుమార సంభవం చూడండి.

శివుని తపస్సును భంగంచేసి, అతనికి పార్వతి పయి అనురాగం కల్గించడానికి పూనుకోవాలని, ఇంద్రుడు మన్మధుణ్ణి కోరేటప్పుడు తన చేతికి తగిన పని లభించిన

దంటూ మన్మధుడు 'తాంబూలం ఇవ్వా' లని ఇంద్రుణ్ణి అడుగుతాడు. తాంబూలం పుచ్చుకున్నవాడు తప్పకుండా ఆ పని నెరవేర్చి తీరాలి. ఇచ్చేవాడున్నా, అట్టి సమర్థునికి యిస్తాడు

## దారిద్ర్యం

ప్రపంచంలో ధనికులు తక్కువ. దరిద్రు లెక్కువ. ఈ దరిద్రులు తమ అవసరాలకోసం ధనికులపై తిరుగుబాటు చెయ్యడం అన్ని దేశాలలోనూ కానవస్తుంది. కొందరు దరిద్రులు దౌర్జన్యానికి పూనుకుంటారు. కొందరు 'మనం వెనక జన్మలో ఎవ్వరికీ దానం చేసి ఉండము, అందువల్లనే లేమిని అనుభవిస్తున్నాము' అని అనుకుంటారు. వారు అనుకున్నది సత్యం.

ఇప్పుడు లేమిని అనుభవించడానికి క్రిందటి జన్మలో దానం చెయ్యక పోవడమే కారణం. తత్ఫలితంగా దరిద్రుడై పుట్టినవాడు లేమివల్ల బాధపడుతూ, తన పొట్ట కోసం నానా తిప్పలూ పడవలసి వస్తుంది. అన్నవస్త్రాల కోసం ఏ పనికయినా సిద్ధపడడం సహజం. అందువల్ల పాపకార్యాలను ఆచరించవలసివస్తుంది. అసత్కార్యాలను చేయడంవల్ల పాపం మూటకట్టుకోవలసి వస్తుంది.

పాపాలను మూటకట్టుకొనుటవల్ల వాటి ఫలాలను అనుభవించక తప్పదు. పాపి అయిన వ్యక్తికి తప్పక నరకం సంభవిస్తుంది.

నరకయాతనను అనుభవించిన తర్వాత— మరొక జన్మ ఎత్తి— ఆ జన్మలో కూడ దారిద్ర్యాన్నే అనుభవించవలసివస్తుంది. పునర్జన్మలో దరిద్రుడు గాకుండా ధనికుడుగా పుట్టరాదా? అని అంటారేమో? ఆ వ్యక్తి సత్కార్యాలుచేస్తే కదా ధనికుడై పుట్టడానికి ?

దరిద్రుడుగా జన్మించినందువల్ల తిరిగి తన జీవయాత్ర సాగించడానికి పాపాలు చేయవలసివస్తుంది.

చేసిన పాపాల వల్ల నరకం పొందడం, తిరిగి దరిద్రుడుగా పుట్టడంజరుగుతూనే ఉంటుంది.

దీనికి అంతం అనేది ఉండదు.

ఇట్టి హీనస్థితి నుండి బయటపడడానికి తనకు కలిగిన దానిలో కొంతదానం చెయ్యడమే తగిన మార్గం.

ఈ విషయాన్ని పెద్దలిలా చెప్పారు సంగ్రహంగా—

"అదానదోషేణ భవేద్దరిద్రః
దారిద్ర్య దోషేణ కరోతి పాపమ్,
పాపాదవశ్యం నరకం ప్రయాతి
పునర్దరిద్రో పునరేవపాపే"

'దానం చెయ్యకపోవడంవల్ల దారిద్ర్యం వస్తుంది. ఆ లేమి పాప కార్యాలను చేయిస్తుంది. పాపం చెయ్యడంవల్ల నరకానికి వెళ్ళవలసి వస్తుంది. అందువల్ల మళ్ళీ దరిద్రుడుగానే పుట్టవలసి వస్తుంది. తిరిగి పాపాలు చెయ్యవలసి వస్తుంది' అని దీని భావం.

## దుఃఖము, సుఖము

ఎన్ని సుఖాలనైనా అనుభవించ వచ్చునుగాని, ఒక్క దుఃఖాన్నయినా అనుభవించలేమని అందరూ అనుకోవడం పరిపాటి. దుఃఖం బాధను కలిగిస్తుందనీ, సుఖం ఆనందదాయకమనీ అనుభవైకవేద్యం.

ఈ సుఖదుఃఖాల స్వరూపం ఎటువంటిది? అనే ఆలోచన కలిగినప్పుడు పెద్దలు చెప్పిన లక్షణం యిది—

'సర్వం పరవశం దుఃఖం
సర్వమాత్మ వశం సుఖం
ఇతి విద్యాత్సమాసేన
లక్షణం సుఖ దుఃఖయోః'

దుఃఖమంతా పరవశమై యుండేది. సుఖమంతా స్వవశమై ఉండేది. ఇది సుఖ దుఃఖాలకు సంగ్రహ రూపమైన లక్షణమని తెలుసుకోవాలి— అని దీని అర్థం.

అంటే- మనకు కలిగే దుఃఖాలు ఇతరములపై ఆధారపడిఉంటాయి. సుఖాలు అలా కాకుండా మన మీదనే ఆధారపడి వుంటాయన్నమాట.

మనకు ఇష్టులైన జనుల వియోగం కలిగినా, ఏదయినా ఆపద కలిగినా దుఃఖం కలుగుతుంది. ఇతరుల పనులవల్లనూ, మాటలవల్లనూ మనస్సు బాధపడి దుఃఖం కలుగుతుంది. ఇతర ప్రాణుల వల్లగాని, వస్తువుల వల్లగాని శరీరానికి బాధ కలిగినా దుఃఖం వస్తుంది. ఈ విధంగా మనకు దుఃఖం కలగడానికి ఇతర ప్రాణులూ, వస్తువులూ కారణమని తెలుస్తూ వున్నది.

మనకు ఏదైనా దుఃఖం కలిగినప్పుడు దానిని పోగొట్టడానికి మనహితులు మంచిమాటలు చెప్పి, ఆ దుఃఖాన్ని పోగొట్టే సంఘటనలను కల్పించి- ఎంతో శ్రమ పడవచ్చు. ఎంతచేసినా- మన ప్రయత్నం ఉంటేనే గాని ఆ దుఃఖం ఉపశమిల్లదు— ప్రశాంతత ఏర్పడదు. సుఖం కలగదు. అందువల్ల మన సుఖం మన చేతిలోనే ఉన్నది కాని ఇతరుల చేతిలో లేదని తెలుస్తూ ఉన్నది.

ఈ విషయాన్నే పయి శ్లోకం సంగ్రహించి చెప్తున్నది. మనిషి మనస్సుకు కొంత ప్రశాంతత కలిగి సుఖం కలగడానికి అవకాశం ఏర్పడుతుంది.

మనస్సును కుదుటపరచుకొనడం కష్టమే.

మానవుని జీవితం వలెనే సుఖదుఃఖాలున్నూ అస్థిరములే!

ఒకసారి దుఃఖం కలిగినదంటే- జీవితాంతమూ అది అలాగున ఉండిపోదు. ఆ విధంగానే సుఖమున్నూ శాశ్వతంకాదు.

సుఖదుఃఖాల బండీ నడుస్తున్నప్పుడు దాని చక్రంలోని రేకులు క్రిందిది మీదికీ, మీదది క్రిందకీ వస్తున్న మాదిరిగా సుఖదుఃఖాలు రెండూ ఒకదాని తర్వాత ఒకటి వస్తూ ఉంటవి.

'సుఖస్యానంతరము దుఃఖః
దుఃఖస్యానంతరం సుఖం
చక్రవత్ పరివర్తంతే
దుఃఖాని చ సుఖానిచ'

అనేదే ఈ సంగతిని తెలుపుతున్నది.

దుఃఖంతో ఉన్నవారు ఈ సంగతిని గ్రహించి 'ఇకనైనా సుఖం కలగక పోతుందా?' అనే ధైర్యం తెచ్చుకోవాలి.

అలా తెచ్చుకోకపోతే శరీరరథం నడిచి జీవయాత్ర సాగడం కష్టతరం!

## దుర్భిక్ష - మరణ - భయాలు

ప్రజలు ఏ విధంగానూ కష్టాలు పడకుండా సుఖంగా కాలం గడుపుతూ ఉంటే- ఆ ప్రాంతము "రామరాజ్యం" అనేపేరు తెచ్చుకొంటుంది. శ్రీరాముడు దేశాన్ని పాలిస్తున్న కాలంలో ప్రజలు ఏ బాధలు లేకుండా ఉండే వారట! నెలకు మూడు వానలూ పడుతూ ఉండడంవల్ల పాడిపంటల లోపం లేకుండా దేశం సుభిక్షంగా ఉండే దట!—మరణం - అంటే అకాలమరణం ఉండేది కాదట! ప్రజలకు చోరులు మున్నగు వారివలన భయం ఉండేది కాదట!

అలా ఉండడానికి కారణం ఏమిటి? అనే ప్రశ్న కలుగవచ్చును. లోకంలో ఉత్తములు ఉండడమే దానికి కారణమట! రాముని వంటి పితృవాక్య పాలకుడు, సీత వంటి మహాపతివ్రత, లక్ష్మణునివంటి భాతృసేవా పరాయణుడూ. హనుమంతునివంటి పరమభక్తుడు వుండడమే రామరాజ్యానికి పేరు రావడానికి కారణం!

ధర్మరాజు న్యాయతత్పరుడై వుండటంవల్ల, అతడు వుండేచోట సుభిక్షంగా ఉండేదట! పాండవులు అజ్ఞాతవాసంలో ఉన్నపుడు, వారిని కనిపెట్టడానికి కౌరవులకు దొరికిన ఆస్కారం- విరటుని మత్స్యదేశం సుభిక్షంగా ఉండడమే! ధర్మరాజు ఉండే చోట కరువు కాటకాలు వుండవని కౌరవులకు తెలుసు.

దేశంలో దుర్భిక్ష, మరణ, భయాలు లేకుండా ఉండాలంటే న్యాయం, ధర్మం ఉండాలి. గౌరవించదగిన వారికి గౌరవం ఉండాలి. అమర్యాదస్థులను దూరంగా తోసివేయాలి.

'అపూజ్యా యత్ర పూజ్యంతే
పూజ్యాశ్చైవా వమానితాం
తత్రైవ త్రీణి వర్తంతే
దుర్భిక్షం మరణం భయమ్'

పూజింపదగనివారు ఎక్కడ పూజింపబడుతారో, పూజింపదగినవారు ఎక్కడ అవమానాన్ని పొందుతారో, ఆ చోటనే దుర్భిక్షమూ, అకాలమరణమూ. చోరమృగాది భయమూ ఉంటాయి— అని దీని అర్థం.

భగవంతుడైన శ్రీకృష్ణుడు ద్వారకలో ఉన్నపుడు, ఆయన దర్శనం కోసం పూజ్యులైన మహామునులు వస్తూఉండేవారు. ఒకప్పుడు మహామునులు వచ్చిన సమయంలో యువకులైన యాదవులు కొందరు పొగరుబోతుతనంతో వారిని అవమానించారు. అందువల్ల ఆ మహామునులకు మితిలేని కోపంవచ్చి సర్వనాశనానికి దారితీసింది

అపూజ్యులను గౌరవించినా— గర్వించిన ఆ అయోగ్యుల మూలంగా అపమృత్యువు మొదలైనవి కలుగుతాయి. భారతయుద్ధానికి. తన్మూలంగా జననష్టం కలగడానికీ ఇదే కారణం!

దేశక్షేమం కోరేవారు యుక్తాయుక్తాలను ఆలోచించి పూజార్హులయిన వారిని గౌరవించాలి కాని అవమానించకూడదు. అయోగ్యులను చాలాదూరంగా ఉంచవలసి ఉంటుంది.

## ధనమదము

ఐశ్వర్యవంతులలో చాలామంది తామే శ్రీమంతులమని గర్వించి ఉంటారు. ధనము ఉన్నందున వారికి ఎట్టి లోపమున్నూ ఉండదు. కావలసిన వస్తువులన్నీ సులభంగానే లభిస్తూ ఉంటాయి. 'నన్ను మించిన వారెవ్వరు?' అనే అహంభావం వారి మనస్సులో ఉంటుంది. వారు ఆలోచించరు కాని, ఆలోచిస్తే తమర్ని మించిన వారు ఉంటారని తెలియక తప్పదు.

ఉదాహరణకు మిణుగురు పురుగులను తీసుకుందాం. సాయంత్రం కాగానే అవి— తామే లోకానికి వెలుగును ఇస్తున్నట్లు తళుకు తళుక్కుమంటూ ఎగురుతూ ఉంటాయి. ప్రకాశవంతమైన నక్షత్రాలు కానరాగానే ఆ మిణుగురు పురుగుల కాంతి ఆ నక్షత్రాల ముందు లెక్కకు రాకుండా పోతుంది.

నక్షత్రాలు ఆకాశంపైని మిలమిల మెరుస్తూ వుండేటప్పుడు వాటిముందు ఈ మెరుగులీనే పురుగుల కాంతి వెలవెల పోతుంది. వాటి గర్వం ఈ విధంగా అణగారి పోతుందన్న మాట !

కాని, ఆ నక్షత్రాల వెలుగుమాత్రం ఎంతవరకూ ఉంటుంది ? చంద్రుడు పొడిచి, వెన్నెలలు వ్యాపింపజేసే అంతవరకు మాత్రమే! చంద్రుడి ముందు నక్షత్రాల కాంతి ఏ మాత్రమూ కనబడదు. కాంతి కనబడకపోవడమే కాదు. చాలా నక్షత్రాలు కనబడకుండా వెన్నెలలోనే కలిసిపోతాయి.

చంద్రుడు రాత్రి అంతా వెన్నెల నీనుతూ తన ఆధిపత్యాన్ని చెలాయిస్తాడు. అతనికి వుండే నక్షత్రేశుడనే పేరు సార్థకం చేసుకుంటాడు.

ఇటువంటి చంద్రుడు కూడా తెల్లవారితే వెలవెల పోతాడు. పొద్దు పొడిచి, కొంచెం ఎండ ఎక్కేసరికి కానరాకుండా పోతాడు. సూర్యుని ముందు నిలిచే ధైర్యం ఏ మాత్రమూ చంద్రునికి లేదు.

ఈ విధంగా ఒకరినిమించి మరొకరు ఉంటూనే ఉంటారు. అందువల్ల ధనికులైనవారు తామే గొప్పవారమని విర్రవీగడం మంచిదికాదు.

ఆ ధనం యొక్క సంబంధాన్ని వదులుకుంటే ధనికుడికీ, దరిద్రుడికీ బేధం వుండదు. పారలౌకిక దృష్టితో చూస్తే వీరిద్దరికీ ఎవ్వరూ బేధాన్ని పాటించనక్కర లేదు.

విర్రవీగకుండా ఉండడం జ్ఞాన సంపాదనకు ఒక మార్గం.

## మానమూ చంద్రతారకం

వాగ్దానం చేసిన ప్రకారం పాండవులు వనవాసాజ్ఞాతవాసాలు పూర్తిచేసి వచ్చిన తర్వాత కౌరవులు పాండవుల రాజ్యాన్ని వారి కీయవలసి ఉన్నది. కాని అది జరగ లేదు. రాయబారాలు వ్యర్థమయినాయి. అందువల్ల భారతయుద్ధం తప్పనిసరి అయింది.

కౌరవులు కర్ణుని బలంపైని, పాండవులు అర్జునుని బలంపైని ఆధారపడి ఉన్నారు. భగవానుడు శ్రీకృష్ణుడు పాండవుల పక్షం వహించి, అర్జునుని రథ సారథ్యం చేస్తూ, అతనికి ప్రోత్సాహమిచ్చాడు. కాని, యుద్ధరంగంమీదికి రాగానే అర్జునుడి ధైర్యం జారిపోయింది. తన బంధువులతోను, మిత్రులతోను యుద్ధంచేసి, వారిని సంహరించడానికి అతనికి మనస్కరించలేదు. తాను యుద్ధం చెయ్యననీ, రథాన్ని వెనకకు త్రిప్పివెయ్యమనీ అతడు భగవానుని అభ్యర్థించాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుడికి ధైర్యం చెప్పుతూ, యుద్ధం చెయ్యడం క్షత్రియులకు ధర్మమనీ, స్వధర్మం నిర్వహించడం విధి అనీ, ఆ ధర్మ నిర్వహణంలో ప్రాణాలు పోయినా మేలే అనీ 'స్వధర్మే నిధనం శ్రేయః' అనీ బోధించాడు. యుద్ధంలో ఒకవేళ మరణమే సంభవిస్తే స్వర్గం లభిస్తుందనీ, విజయమే లభిస్తే రాజ్య సుఖాలను అనుభవించవచ్చుననీ 'హతో వా ప్రాప్యసే స్వర్గం జితో వా భోక్ష్యసే సుఖం' అని యుద్ధానికి ప్రోత్సహించాడు.

ముఖ్యమైన మరొక్కటి మానరక్షణ.

యుద్ధరంగం ప్రవేశించి - ఇంకా కొద్దిసేపటికి యుద్ధం ప్రారంభమవుతూ ఉండగా - శంఖ ధ్వానాలు మిన్నుముట్టిన సమయంలో "నేను యుద్ధం చెయ్యను; వెనుకకు పోదాం. నాకు రాజ్యంతో నిమిత్తం లేదు" అని చెప్పడం మానాన్ని చంపు కొని నిందలుపాలు కావడమే అవుతుంది. ప్రాణం కంటె, మానమే ఉత్తమం. అందు లోనూ క్షత్రియునికి మానహాని తల కొట్టినట్లే కదా! తన మానాన్ని కాపాడుకొనుటకు అర్జునుడు యుద్ధం చెయ్యవలసినదే!

"ప్రాణానపి పరిత్యజ్య
మానమే వాభి రక్షతు,
ప్రాణా స్త రంగచపలాః
మాన మాచంద్రతారకమ్"

ప్రాణాలను విడిచిపెట్టి అయినా, మానాన్ని రక్షించుకోవలసి ఉంటుంది. ఏమంటే ప్రాణాలు తరంగాలవలెనే మిక్కిలి చంచలములైనవి - అనగా క్షణికములు. మానం మాత్రం చంద్రుడూ, నక్షత్రాలూ ఉన్నంతకాలమూ ఉంటుంది - అని దీని అభిప్రాయం.

భగవద్గీత బోధించే ధర్మాలలో మానరక్షణ ఉత్తమ స్థానాన్ని ఆక్రమించి ఉన్నది.

## మన దేవాలయాలు

భారతదేశంలో స్థిరంగా ఉంటున్న నిర్మాణాలలో దేవాలయాలు మొదట గణించ దగినవి. పూర్వకాలపు రాజులు తమ భవనాలకంటెను కూడా ఎక్కువ శ్రద్ధతో కోట్లకొద్దీ ధనం వెచ్చించి వాటిని నిర్మించేవారు. రాజభవనాలు నామరూపాలు లేక నశించిపోయినా, శిలానిర్మితాలయిన దేవాలయాలు ఎన్నో శతాబ్దాలుగా చెక్కుచెదర కుండా ఉన్నవి. అవి దేవుని నివాసాలు కావడంవల్ల ఎంతో కాలం నిలుస్తాయేమో అని అనిపిస్తుంది.

జనసమూహాన్ని ఆకర్షించే శిల్పసంపదకు దేవాలయాలు నిలయాలు. వాటి గోపురాల పైని, స్తంభాలపైని, గోడలమీద పురాణగాథలు చిత్రింపబడి ఉంటాయి.

దేవాలయాలకు దానాలు చేసినవారి శాసనాలు కూడ దేవాలయాల గోడలపయి ఉంటాయి. ఇవన్నీ విజ్ఞాన దాయకాలు అగుటలో ఆశ్చర్యం అక్కర్లేదు.

ఇలాగే డబ్బు బాగా ఉన్న ఆలయాలలో వెండి వాహనాలూ, ఇత్తడి మున్నగు ఇతర లోహాల వాహనాలూ ఉంటాయి. లక్కరంగుల కర్ర వాహనాలు చాలా దేవాలయాలలో కానవస్తాయి. పెద్దదేవాలయాలకు సొంతంగా ఏనుగులు మొదలైనవి కూడా ఉంటున్నవి.

ఇవన్నీ దేనికి? తన వైభవాన్నీ, సంపదనూ చూచుకొని దేవుడు సంతోషించడానికా? అది కానేకాదు. జన సమూహాన్ని ఆకర్షించడానికి!

దైవభక్తి లేనివారు దేవాలయాలకు వెళ్ళడానికి మొగ్గరు. గుడిలోని దేవుడు కాకపోయినా దేవాలయంలోని శిల్ప సౌందర్యం వాహనాలు, శాసనాలు మొదలైనవి వారిని ఆకర్షిస్తాయి. వీటికోసం దేవాలయంలో అడుగుపెట్టే - అట్టివారికి రానురాను దైవభక్తి కలగవచ్చును.

ముఖ్యంగా పసిబాలురకు దైవభక్తి కలిగించడానికి ఇవి బాగా ఉపకరిస్తాయి. పిల్లలకు దైవభక్తి ఆదిలో ఉండకపోవచ్చు. గుడికి చెందిన ఏనుగును చూడాలనే కుతూహలం వారిని గుడికి తీసుకు వెళుతుంది. తర్వాత రంగురంగుల వాహనాలు ఎంతో ఆకర్షిస్తాయి. దినంలో చాలాభాగం వారు వాటిని చూస్తూ, వినోదిస్తూ ఆకలి దప్పికలను కూడా మరిచిపోతారు.

వారికి క్రమంగా దైవభక్తి కుదురుతుంది.

చిన్నతనంలోనే దేవునిపై భక్తి కుదిరినట్లయితే అది స్థిరంగా ఉండిపోగలదు.

ఈ విశాలమైన దృష్టితోనే మన పూర్వులు ఎంతో ధనాన్ని వెచ్చించి, ఈ విధంగా దేవాలయాలను నిర్మించారు. ప్రభువులు తమ సౌధాలకంటె కూడా దేవాలయాల విషయమై ఎక్కువ శ్రద్ధ చూపేవారు.

## బద్ధుడైన భగవంతుడు - బద్ధులు కాని భక్తులు

జీవుడు సంసారబంధంలో చిక్కుకొని, నానావస్థలూ పడుతూ ఆ బంధం నుంచి ఎలాగ విడుదల పొందడమా అని పరితపిస్తూ ఉంటాడు భగవంతుడిట్టిబంధాలు లేకుండా నిర్విచారంగా ఉంటాడు. కాని, ఒక్కొక్కప్పుడు భక్తులకోసం తాను బంధంలో చిక్కుకుని వారికి వాటినుంచి విడుదల కలగజేస్తూ ఉంటాడు.

నలకూబరుడూ, మణిగ్రీవుడూ నవనిధులకూ అధిపతిఅయిన కుబేరుని కొడుకులు. పరమేశ్వరుని సేవకులలో ముఖ్యులు. అయినా ధనమందాధులు. ఒకప్పుడు వారు కైలాసగిరిపైనున్న వనంలో తాగి, యువతులతో తందనాలాడుతూ, తమ పరిధానాలు విడిపోయినా గమనించకుండా ఉండిరి. అప్పుడు ఆ ప్రాంతానికి వచ్చిన నారద మహర్షి వీరి అసభ్య ప్రవర్తనకు ఏవగించి, కోపించి భూలోకంలో జోడు మద్దిచెట్లయేటట్లు శపించాడు. తర్వాత వారు అతని కాళ్లపయిపడి ప్రార్థించగా కరుణించి, చాలాకాలం భూలోకంలో వృక్షరూపంలో వుండి, శ్రీకృష్ణుని పాదస్పర్శవల్ల తిరిగి మామూలురూపం వచ్చేటట్లు శాపవిముక్తిని అనుగ్రహించాడు. వెంటనే నలకూబర, మణిగ్రీవులు యమళార్జున వృక్షములై వ్రేపల్లెలో ఉద్భవించారు.

బాలకృష్ణుని చిలిపిచేష్టలకు విసిగి, కోపించిన యశోదాదేవి అతడు యిల్లు దాటి ఎక్కడికీ వెళ్లకుండా ఉండేటందుకు చిన్నికృష్ణుని ఉదరానికి తాడు చుట్టి, ఒక రోటికి అతనిని బంధించినది. అతడు ఆ రోటిని లాగుకొంటూ ఇల్లు దాటి సమీపంలో ఉన్న జంటమద్దుల మధ్యనుంచి ఆ రోటిని ఈడ్చుకుంటూ వెళ్లాడు. దగ్గర దగ్గరగా ఉన్న ఆ మద్దిచెట్లు రోటికి అడ్డం తగిలాయి. బాలకృష్ణుడు కోపించి ఒక్కతన్ను తన్నేసరికీ ఆ రెండుచెట్లూ పెళపెళా విరిగి నేలపై పడిపోయి, ఆ పడిపోయిన వెంటనే వృక్షరూపాన్ని విడిచి, యక్షరూపంపొంది; నలకూబర, మణిగ్రీవులుగా మారిపోయాయి. వెంటనే ఆ కుబేరపుత్రులిద్దరూ శ్రీకృష్ణుని పాదాలకు నమస్కరించి, అతనిని అభినందిస్తూ, తమ నివాసానికి వెళ్ళిపోయారు. ఈ విధంగా రజ్జుబద్ధుడైన భగవంతుడు శాపబద్ధులైన యక్షకుమారులను బంధ విముక్తులను చేశాడు

**భక్తుల కష్టాలను తొలగించడానికి భగవంతుడు తాను శ్రమను సహించడానికి వెనుదీయడు.**

అతనికి బంధం అనేది ఒక విలాసమే కావచ్చును. అయినా – బంధం ఎట్టిదయినా బంధమే అవుతుందికదా!

## కాషాయవస్త్రాలు

సన్న్యాసులు కాషాయవస్త్రాలను ధరించడం మనం చూస్తూ ఉంటాము. వారు కావి గుడ్డలనే తప్ప మరొకరంగు వస్త్రాలను ధరించరు. అందులోనూ ముతకబట్టలనే తప్ప సన్నని వస్త్రాలను ధరించరు.

వారు కావి గుడ్డలనే ఎందుకు ధరించాలి? అనే సందేహం కలగడం సహజమే.

పూర్వం అడవులలో నివసించే మునులు, వానప్రస్థులు చెట్ల నారలతో తయారయిన నారబట్టలనే ధరించేవారు. నూలు వస్త్రాలు వారికి లభించవు. లభించినా, వాటిని వారు స్వీకరించరు.

ఇక గృహస్థులకూ, ఇతరులకూ పరమార్థాన్ని గురించి ప్రబోధం చేస్తూ ఉండే సన్న్యాసులు కావిరంగు వస్త్రాలను ధరించడానికి కారణ ముంది.

కాషాయవస్త్రాలు పరిశుద్ధికీ పవిత్రతకూ చిహ్నాలు. వాటిని సన్న్యాసులు తప్ప ఇతరులు ధరించరాదని మన పెద్దలు ఒక నియమాన్ని ఏర్పరచినారు. కాషాయవస్త్రం ధరించినవారు యతులే అని మనస్సులో ఒక నమ్మకం అందువల్లనే ఏర్పడుతుంది.

సన్న్యాసి యోగ్యతాయోగ్యతలతో మనకు పనిలేదు. వాటిని ధరించినవాడెట్టివాడయినను పూజ్యుడే అని.

కాషాయ దండమాత్రేణ
యతిః పూజ్యో న సంశయః

అనే నుడికారం తెలుపుతూనే ఉన్నది.

మరొక సంగతి ఏమిటంటే – కాషాయవస్త్రాలను ఎంత ఉతికినా రంగుపోదు. ఉతకడంవల్ల మురికి పూర్తిగా నశిస్తుంది.

ఇప్పటికిన్నీ ప్రాచీన సంప్రదాయానికి చెందినవారు బట్టలను రకరకాల ఉప్పులతో ఉడకబెట్టి చలువ చెయ్యరు. రోజూ ఉతుకుతూ ఉంటారు. అలా చెయ్యడంవల్ల క్రమంగా వాటికి ఒకరీతి కావిరంగు వస్తుంది. దానినే నీరుకావి రంగు అంటారు. నీరుకావి బట్టలు కూడా పవిత్రతను వ్యక్తం చేస్తూ ఉంటాయి.

కావి బట్టలు ధరించేవారికి వ్యామోహం ఉండదు.

చలువచేసి, మంచి అంచులతోకూడా తెల్లగాఉన్న వస్త్రాలు మనుష్యుల మనస్సులను ఆకర్షిస్తాయి. వ్యామోహాన్ని పెంచుతాయి గాని తగ్గించవు.

తెల్లగా ఉండడానికి వస్త్రాలకు ఎంతోసేవ చెయ్యవలసి ఉన్నది.

కావిగుడ్డలకు అట్టి సేవ అవసరం లేదు. ఒక్క నిర్ణేజనమే– ఉతకడమే చాలు

## మాయా స్వరూపం

బ్రహ్మం తప్ప తక్కినదంతా మాయయే అని అంటారు. మాయ నశిస్తేనేగాని బ్రహ్మ సాక్షాత్కారం కాదు. మాయ మనల్ని భగవంతుడికి దూరంగా తీసుకుని పోతుంది. జ్ఞానం మనల్ని భగవంతుడి దగ్గరకు తీసుకుని వెళుతుంది.

మాయ మనకి 'నేను, నాది' అనే బుద్ధిని పుట్టించి సంసారంలో పడదోస్తుంది. కామ క్రోధాదులు కలుగుతాయి. జ్ఞానం కలిగితేగాని ఆ మాయ తొలగిపోదు.

తెర పల్చగా ఉన్నా, దానికి అవతలవైపు ఉన్న వస్తువు స్పష్టంగా కానరాదు. తెర తీసివేస్తేనే బాగా కనబడుతుంది. బురదనీటిలో సూర్య, చంద్రుల ప్రతిబింబం స్పష్టంగా కనబడదు. బురద లేకుండా జలం నిర్మలంగా ఉన్నప్పుడే స్పష్టంగా కాన వస్తుంది. ఆ విధంగానే తెరగా ఉన్న మాయ తొలగిపోయినపుడే ఆత్మ సాక్షాత్క రిస్తుంది. "నేను, నాది" అనే అహంకార, మమకారాలు నశించినప్పుడే అది సంభ విస్తుంది.

భగవంతుడు అంతటా వ్యాపించి ఉంటాడు. అంటే పరమాత్మ సర్వ వ్యాపి అన్న మాట. అయినా అజ్ఞాన రూపమైన మాయ - ఆయన మనకు కానరాకుండ కప్పి వేస్తుంది. సూర్యుడు గొప్ప తేజస్సుతో ప్రకాశిస్తాడు, సమస్త వస్తువులనూ ప్రకాశింప జేస్తాడు. కాని, ఒక చిన్న మబ్బు ఆ సూర్యుణ్ణి కప్పివేసి, అతడు కనబడకుండా చెయ్యగలదు. ఆ మబ్బు తొలగిన తర్వాతనే అతడు కనిపిస్తాడు.

ఆ విధంగానే మాయ అనే చిన్న తెర భగవంతుడు మనకు కనబడకుండా అడ్డు వస్తుంది. అది తొలగినంతనే భగవత్సాక్షాత్కారం కలుగుతుంది.

ఈ మాయను తొలగించుకోవాలంటే అంతశ్శత్రువులైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను అరికట్టాలి

ఆ అరిషడ్వర్గానికీ లొంగకుండా ఉన్నప్పుడే మాయను తొలగించడం సాధ్య మవుతుంది.

## సంశయాత్మా వినశ్యతి

చరిత్ర ప్రసిద్ధమై అనేకమైన వింతలకు నిలయమైన ఒక పట్టణానికి ఒకడు వెళ్ళాలని చాలా కుతూహలపడి బయలుదేరాడు. ఆ పట్టణం చేరడానికి అనేకమార్గాలు

ఉన్నవి. ఏ మార్గాన వెళితే సుళువుగా చేరుకుంటామో అతనికి తెలియదు - అందువల్ల ఎవరినో అడగ్గా అతడు ఒక దారిని చూపాడు. ఇతడు ఆ మార్గంగా కొంతదూరం ప్రయాణం చేశాక తనకే సందేహం కలిగింది - అది సరియైన మార్గం అవునో, కాదో అని. అందుచేత ఆ దారినే పోతున్న ఒకరిని అడిగాడు - తన గమ్యస్థానానికి అది సరియైన మార్గమేనా? అని. అతడు 'అయ్యో! మీరు పొరపాటు పడ్డారు. ఈ దారిని పోవడం సరికాదు.' అని మరోమార్గాన్ని చూపాడు. ఈయన వెనక్కు పోయి, అతడు చూపినదారినే చాలా దూరం ప్రయాణం సాగించాడు. మళ్లీ సందేహం కలిగింది. అది సరియైన దారి అవునా, కాదా? అని. తనకు కనపడిన మరోవ్యక్తిని ప్రశ్నిస్తే అతడు అది సరియైన తోవ కాదని మరో మార్గం సూచించాడు. ఈ సందిగ్ధుడు ఆ దారిని పట్టుకొని ప్రయాణం సాగించాడు. కాని, కొంతదూరం పోయాక మళ్లీ సందేహం కలిగింది. ప్రయాణీకులలో ఒకరిని అడిగితే అతడు చేరదలచుకొన్న పట్టణానికి అది తగినదారి కాదంటూ మరోదారిని చూపించాడు. ఈ సంశయాగ్రస్తుడు ఆ మార్గంగా వెళుతూ, మరల సందేహించి ఇంకొకరిని అడగ్గా అతడు ఇంకోదారిని చూపాడు. ఈ విధంగా అతనికి మార్గాలు మారడంతోనే సరిపోయింది. అతడు గమ్యస్థానాన్ని చేరుకోనేలేదు.

ఆత్మతత్త్వాన్ని తెలుసుకొన గోరేవారి పద్ధతికూడా ఇటువంటిదే!

ఆత్మతత్త్వాన్ని తెలుసుకోదలచిన యెడల ఒక గురువును ఆశ్రయించి, కొంత తెలుసుకుని, ఆయన సరిగా బోధింపలేదని ఆయనను విడిచిపెట్టడం, ఇంకొకరిని ఆశ్రయించడం సరియైన పద్ధతి కాదు. కొంత కాలానికి ఆయన విషయంలో కూడా అసంతృప్తి కలుగుతుంది. అందువల్ల మరొక గురువును మార్చాలనే బుద్ధి కలుగుతుంది కూడా. ఈ విధంగా గురువుల యెడల సందేహం కలుగుతూ వుంటే తత్త్వాన్ని గ్రహించడం సాధ్యపడనే పడదు.

అందువల్ల మనస్సుని నిస్సందేహంగా ఉంచుకోవాలి. మొదటనే బాగా ఆలోచించి, తగిన గురువును నిర్ణయించుకోవాలి. ఆయన ఉపదేశించేది కొంతకాలం అవగాహన కాకపోయినా, ఆయననే నమ్ముకొనివుంటే క్రమంగా అవగాహన కాగలదు. మనస్సులో సందేహం కలగడంవల్లనే గురువుల మార్పిడికి అవకాశం ఏర్పడుతుంది. సందేహం లేకుండా మనస్సును స్థిరంగా ఉంచుకున్నప్పుడే, ఒక్క గురువునే నమ్మి ఉన్నప్పుడే మానవుడు ఆయన మూలాన ఆత్మతత్త్వాన్ని తెలుసుకోగలుగుతాడు.

## కలిమిలేములు

"ధనమూల మిదం జగత్" అంటారు. ధనంవల్ల సాధించ సాధ్యం కానిది ఏదీ లేదని "న హి తద్విద్యతే లోకే యదర్థేన న సిద్ధ్యతి" అనే రాజనీతి చెప్తున్నది. అందువల్లనే దరిద్రుడు ఏ పనినీ చెయ్యలేడు. దారిద్ర్యంకంటే మరణమే మేలైన దని

'దారిద్ర్యా న్మరణాద్వా
మరణం మే రోచతే న దారిద్ర్యమ్'

అని అతడు భావిస్తూ ఉంటాడు.

ఇది అందరూ ఎరిగిన విషయమే!

అయినా దీనికి వ్యతిరేకమయిన అభిప్రాయం కూడా లేకపోలేదు. కలిమికంటే లేమియే ఒక్కొక్కప్పుడు మేలని అనిపిస్తుంది.

ధనికులకు తృప్తి ఉండదు. ధనం ఎక్కువగా ఉన్నా ఇంకా సంపాదించాలనే కోరిక ఉంటుంది. "నన్ను నీవు పెంచితే నిన్ను నేను పెంచుతాను" అని ధనం అంటుందని లోకంలో ప్రసిద్ధి. ధనం అధికమైన కొద్దీ మదం ఎక్కువ అవుతుందట. "ధన మెచ్చిన మద మెచ్చును" అని అనుభవజ్ఞుడైన కవి వాక్కు.

కుబేర పుత్రులైన నలకూబరుడూ, మణిగ్రీవుడూ గొప్ప శ్రీమంతులై నందున దుర్వ్యసనాలకు లోనయి, మదించి, కన్ను గానకుండా ఉండడం చూచి, నారదుడు ధనంవల్ల కలిగే చెడుగును ఈ విధంగా తెలియజేసినట్లు ఉన్నది. ఆ సందర్భంలో పోతన్న గారి పద్యం-

'సంపన్నుం డొరుల గానలేఁడు తనువున్
సంసారమున్ నమ్మి హిం
సింపంజూచు దరిద్రుఁ డెత్తువడి
శుష్కీభూతుడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సములుగాఁ
జింతించు నట్లాటఁ ద
త్సంపన్నాంధుల కంజనంబు వినుమా
దారిద్ర్య మూహింపఁగన్.'

ధనవంతుడు ఇతరులను చూడడు. అతడు తన దేహాన్నీ, తన సంసారాన్నీ శాశ్వతాలని నమ్ముతాడు. ఇతరులను హింసించడానికే చూస్తాడు. దరిద్రుని సంగతి వేరు. అతడు చెడి, చిక్కి పోయి ఉంటాడు. ఎవ్వరినీ హింసించడు. అందరినీ తనతో సమంగా చూస్తాడు. దారిద్ర్యం అనుభవిస్తూ ఉన్నప్పుడే-ఐశ్వర్యంవల్ల కన్నులు కానరాకుండా తిరిగే వారికి కొంత జ్ఞానం కలుగుతుంది. కన్నులు కనబడనివానికి అంజనం పెడితే తిరిగి కన్నులు కనబడే విధంగా ధనవంతుడు సరియైన పద్ధతిలో నడుచు కోడానికి దారిద్ర్యాన్ని అనుభవించవలసి ఉంటుంది.

శ్రీమంతుడై ఉండుటకంటే దరిద్రుడుగా ఉండడమే సర్వవిధాలా ఉత్తమం.

ఇది ధనమదాంధుల విషయమని గ్రహించాలి.

## వివిక్త ప్రదేశపు విశిష్టత

విద్యాభ్యాసమునకు గాని, నిశ్చలమైన ధ్యానమునకు గాని ప్రశాంతత మిక్కిలి అవసరము. ఆ ప్రశాంతత వివిక్త స్థలమునందే నిర్జనమైన చోటనే సులభము.

ప్రారంభావస్థలో సాధనకు ఈ ప్రశాంత ప్రదేశము అవశ్యకమై యుండును. కాని, సాధనలో ఆరితేరిన పెద్దలకు మాత్రము దీనితో పనిలేదు. ఎట్టి ప్రదేశమునందు ఉన్నను వారి ధ్యాన నిష్ఠకు ఎట్టి ఆటంకముకలుగదు. లౌకిక విషయములు ఏమాత్రము వారి మనస్సులను చలింపచేయలేవు.

విద్యాభ్యాస కాలంలోనే శిష్యునికి మరో నిశ్చలత్వం కోసం ప్రశాంత ప్రదేశం ఉండవలెనే కాని, విద్యాపరిపూర్ణులైన పండితులకు అక్కరలేదు. ఏ స్థలంలోనైనా వారు తమ పాండిత్య ప్రకర్షను ప్రకటించగలరు.

ఈ విషయాన్ని ఒక చక్కని ఉదాహరణతో వివరించవచ్చును.

ఒక చిన్నమొక్క ఉన్నది అనుకుందాం. దానికి పాదుచేసి, నీళ్ళుపోసి, పెంచితే అది పెద్దదవుతుంది. లేకపోతే చచ్చిపోతుంది. దాని ఆకులు మేకలు అవీ తినివెయ్యకుండా చూడాలి. అందుకోసం దానిచుట్టూ ముళ్లకంచె వెయ్యాలి. అలా చేసినప్పుడే దాన్ని జాగ్రత్తగా పెంచడం సాధ్యమవుతుంది.

బాలారిష్టాలు దాటి ఆ మొక్క బాగా పెరిగి వృక్షమయేవరకూ జాగ్రత్తగా ఉండవలసిందే; అది మహావృక్ష మయాక దానికి ఎట్టి రక్షణా అక్కరలేదు. అది

ఎత్తుగా పెరిగిపోవడంవల్ల దాని ఆకులు మేకలు మొదలైనవాటికి అందవు. దానిచుట్టూ ముళ్ళకంచె అనవసరం, నీటిని పొయ్యనక్కరలేదు.

అందువల్ల ఉపాసకునికి ప్రారంభావస్థలోనే సాధనకు వివిక్తప్రదేశం మున్నగునవి కావాలి.

సాధనలో ఆరితేరిన తర్వాత ప్రశాంతప్రదేశం అక్కరలేదు. ఎట్టి జనసమ్మర్థంగల చోటులోనయినా అతడు తన సాధనను కొనసాగించగలడు.

## నారదుడు చేసిన యోగి పరీక్ష

భగవంతుణ్ణి ప్రత్యక్ష్యం చేసుకునే సంకల్పంతో ఇద్దరు యోగులు ఒక ప్రశాంత స్థలంలో ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చెయ్యసాగారు. వారిని పరీక్షించదలచి ఒకనాడు నారదమహర్షి వారి దగ్గరికి వచ్చాడు ఆ వచ్చిన మహర్షి నారదుడని తెలుసుకొని ఆ యోగులు ఆయనకు అర్ఘ్యపాద్యాదులను ఇచ్చి గౌరవించి ఒక దర్భాసనంపై సుఖోపవిష్టుణ్ణి చేశారు.

తర్వాత వారిలో ఒకడు "మహామునీ! తమరు ఇప్పుడు వస్తూవున్నది వైకుంఠం నుంచేనా?" అని ప్రశ్నించగా, నారదుడు "ఔ" నంటూ తల ఆడించాడు. ఆ యోగి "అయితే యిప్పుడు శ్రీమహావిష్ణువు ఏమి చేస్తున్నదీ సెలవియ్యండి" అని అడిగాడు. అందుకు నారదుడు "ఆయన యిప్పుడు సూది బెజ్జంలోకి ఏనుగులనూ, లొట్టిపిట్టలనూ దూరుస్తూ ఉన్నాడు." అని సమాధానమిచ్చాడు.

అది విని ఆ యోగి నవ్వుతూ 'మీరు సెలవిస్తున్నది చాల వింతగా ఉన్నది. సూది బెజ్జంలోకి ఒంటెలనూ, ఏనుగులనూ దూర్చడమా? దీనిని ఎవరైనా నమ్ముతారా ఇది సాధ్యమయే పనేనా? కలహభోజనులైన తమరు అసత్య ప్రియులని దీనివల్ల కూడా తెలుస్తున్నది. మీరు వైకుంఠం నుంచి రావడమూ, భగవంతుణ్ణి చూడడమూ కూడా సందేహంగానే కానవస్తున్నది' అని అన్నాడు.

నారదుడు ఏమీ సమాధానం చెప్పక మౌనంగానే ఉండిపోయాడు.

రెండవయోగి మాత్రం అలా భావించలేదు. అతడు తన సోదరయోగిని చూచి "సోదరా! నీవు పొరపడుతున్నావు. మహామునియైన నారదుడు అసత్యమాడుతున్నట్లు అనుకుంటున్నావు. ఆయన చెప్పినది యధార్థం కాదనలేము. మానవదృష్టితో చూస్తే, యిది అసాధ్యమే! అసత్యంలాగా కూడా తోస్తుంది. కాని భగవంతుడు మానవ

మాత్రుడు కాదు. ఆయనకు అసాధ్యమని చెప్పే కారణమేమీ లేదు. ఏనుగులను సూది కన్నంలో ఎక్కించడం ఆయనకు ఏమి లెక్క?

'మూకం కరోతి వాచాలం
పంగుం లంఘయతే గిరిమ్, మత్కృపా—'

అన్నది వినలేదా? ఆయన అనుగ్రహం వుంటే మూగవాడు మహావక్త ఐపోతాడు. కుంటివాడు ఎగిరి కొండలను కూడా దాటగలడు. అట్టి అపూర్వశక్తి భగవంతునికే ఉన్నది. అఘటన ఘటనా సమర్థుడయిన పరాత్పరుని విషయంలో నీ కెందుకు సందేహం కలిగిందో నాకు తెలియడం లేదు." అని అన్నాడు.

నారదుడు గట్టిగా నవ్వుతూ "అబ్బాయిలూ: మిమ్మల్ని పరీక్ష చెయ్యడానికే ఇలా తమాషా చేశాను. భగవంతునిపై నమ్మిక లేకుండా చేసే సాధన, తపస్సు నిష్ప్రయోజనాలని తెలుసుకోండి. సాధ్యాసాధ్యాలను గురించి విమర్శించకుండా నిస్సందేహంగా ఉండి చేసిన సాధనయే సత్ఫలితాన్నియిస్తుంది. ఈ విషయాన్ని మీ యిద్దరిలో రెండవవాడే గ్రహించ గలిగాడు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

## సంసారులు-సన్న్యాసులు

నాడు సన్న్యాసులు మునివృత్తి నవలంబించి అడవులలో తపస్సు చేసుకుంటూ జనానికి దూరంగా ఉండేవారు. అయినా జనులు వచ్చి తమ్ము సలహాలను అడిగి నప్పుడు హితాన్ని బోధించేవారు. రాజ్యాంగంలో ఏ చిక్కులు సంభవించినా, వాటి పరిష్కారం కోసం రాజులు వారి సలహాల ప్రకారం నడచుకొని, ఆ సమస్యలను పరిష్కరించుకొనేవారు. పోతే-ధర్మ ప్రచారానికి, తీర్థ యాత్రలకూ దేశ సంచారం చేసే సన్న్యాసులకు గృహస్థులు భిక్ష పెట్టి గౌరవించేవారు. యతులను పూజించడం తమ ధర్మమని బాగా తెలుసుకునేవారు.

కాలం మారి పోయింది. రత్నగర్భ అని పేరుపొంది యితర దేశాలకు ఆహారధాన్యాలు సరఫరా చేసే భారతదేశం తిండికి ఇతర దేశాలపై ఆధారపడవలసి వచ్చినది. ఈ స్థితి మనకు బ్రిటిష్ పాలనలో శతాబ్దం క్రిందటే ఏర్పడింది. సర్వ మత మహాసభకు షికాగోకు వెళ్ళిన స్వామి వివేకానందులు "మీకు భారతదేశాన్ని ఉద్ధరించే సంకల్పంఉంటే మతప్రచారానికి ప్రవక్తలను పంపవలసిన అవసరం లేదు.

ఆ విషయంలో ఇతర దేశాల కంటె అది సమృద్ధమయి, ఇతర దేశాలకు, మేలైన సందేశాలిచ్చే స్థితిలోనే ఉన్నది. కావలసినది తినుటకు తిండి, కట్టుటకు గుడ్డ, వాటికి మీరు చేయవలసినది ఆర్థిక సహాయం మాత్రమే" అని ప్రార్థింప వలసి వచ్చింది. తిండికీ, గుడ్డకూ బాధపడుతున్న ప్రజలకు మతాన్ని గురించి చెప్పితే ఎలా తల కెక్కుతుంది? మొదట వారికి కనీసపు సౌకర్యాలు ఏర్పడాలి. ఈ విషయాన్ని గ్రహించిన వివేకానందులు భారతదేశంలోనే కాకుండా ఇతర దేశాల్లో కూడా రామకృష్ణ పరమహంస పేరిట మఠాలను స్థాపించి ప్రజాసేవకు స్థిరమైన ఏర్పాట్లు చేశారు. ఈ విధంగా ఆధునిక యుగంలో సన్న్యాసులే నిస్సహాయులైన ప్రజల అవసరాలు తీర్చుటకు తగిన బాధ్యత వహించవలసి వచ్చింది.

ప్రజాస్వామ్యం ఆరోగ్యం, విద్య, ఆహారం, మున్నగు వాటి విషయంలో శ్రీరామకృష్ణ మిషన్‌వారు చేస్తున్న సేవ సాటి లేనిది. అతివృష్టి, అనావృష్టి, ఆకస్మికంగా ఏర్పడ్డ ప్రమాదం మున్నగునవి తటస్థించినపుడు ప్రజలను ఉద్ధరించడానికి కార్యరంగంలో ముందడుగు పెడుతున్నది వీరే అని అందరికీ తెలుసును.

ఈ విధంగానే మత త్రయం వారి మఠాలు, ఆశ్రమాలు, ఇతర మతస్థుల నిలయాలు జన సంఘానికి చేసిన - చేస్తున్న సేవలు అమూల్యమైనవి.

సన్న్యాసులకు -శరీర రక్షణకు స్వల్పమైన ఆహారం - సాత్వికాహారం తప్ప మరేమీ అక్కర లేదు. వారు కోరుతున్నది ప్రజాక్షేమం! పాటుపడుతున్నదీ ప్రజాక్షేమం కొరకే!





సాహితివాహినిలో
ఇంతవరకు వెలువడిన
తరంగాలు

| | | |
|---|---|---|
| 1. | మందారమకరందాలు | రు. 0 |
| 2. | వేమన్న వేదం | ,, |
| 3. | భోగినీలాస్యం | ,, |
| 4. | వడగళ్ళు | ,, |
| 5. | నా గొడవ | ,, |
| 6. | శ్రీనాథుని కవితావైభవం | ,, |
| 7. | విశ్వనాథ కవితావైభవం | ,, |
| 8. | సిందూరం | ,, |
| 9. | శిఖరాలు-లోయలు | ,, |
| 10. | భావన | ,, |
| 11. | మెరుపులు | ,, |
| 12. | తిక్కన కవితావైభవం | ,, |
| 13. | చలం ఆలోచనలు | ,, |
| 14. | భారతీ వైభవం | ,, |
| 15. | తిమ్మన కవితావైభవం | ,, |
| 16. | ధూర్జటి కవితావైభవం | ,, |
| 17. | తులసీదాసు కవితావైభవం | ,, |
| 18. | నన్నయ కవితావైభవం | ,, |

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

Cover Printed at New Vistas Printers, Hyd-27.